కాకతీయ విశ్వ విద్యాలయం బి.ఎ; బి. యస్‌సి; బి. కాం.

మొదటి భాగం తెలుగు పాఠ్యపుస్తకం

# గద్య మంజరి






తెలుగు విభాగము
విద్యారణ్యపురి

కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్లు

కాకతీయ విశ్వ విద్యాలయం బి.ఎ; బి. యస్‌సి; బి. కాం.

మొదటి భాగం తెలుగు పాఠ్యపుస్తకం



# గద్య మంజరి



తెలుగు విభాగము
విద్యారణ్యపురి

కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్లు

# GADYA MANJARI

Selections from Telugu Prose under Part I
for
**B.A., B Sc , B.Com. First Year**
1982-83, 1983-84, 1984-85 Academic Years



General Editor:
**Dr. K. V. Ramakoti Sastry**
Head, Dept. of Telugu

Editors:
**Dr. P. Vara Vara Rao,** Dept. of Telugu
C. K. M. College, Wgl.

**M. Appala Charya,** Dept. of Telugu
Kakatiya Govt. Degree College, Wgl.



Copies: 3,000

**PRICE: Rs. 3 - 50**

Copies can be had from:
**The Registrar, Kakatiya University, Warangal**

Printed at:
**Venkataramana Mudranalayam, J.P.N. Road, Warangal.**

# విషయ సూచిక

# సంపాదకీయం

కాకతీయ విశ్వవిద్యాలయ సర్వకళాశాలల తెలుగు అధ్యాపకుల ప్రథమ మహాసభ 30-4-1977న తీసుకొన్న నిర్ణయం ప్రకారం బి.ఏ; బి యస్‌సి; బి.కాం. తరగతుల మొదటిభాగం తెలుగు పాఠ్యపుస్తకాలను ప్రచురించడం విశ్వవిద్యాలయం విధానంగా ఆమోదించింది. ఆ క్రమంలో 1977 లో రత్నాపణం, 1979 లో ముక్తావళి, 1980 లో రత్నావళి పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. ఈ 1982 వ సంవత్సరంలో ప్రాచీన పద్యమంజరి, ఆధునిక పద్యమంజరి, గద్యమంజరి అనే మూడు పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

కాకతీయ విశ్వవిద్యాలయం ఏర్పడ్డప్పటినుండి కూడా డిగ్రీ తరగతుల పాఠ్య గ్రంథాలను నిర్ణయించటంలో కళాశాలల్లో పనిచేసే తెలుగు అధ్యాపకుల పాత్ర ప్రధానంగా వుంది. వారు సూచించిన కవులనూ రచయితలనూ గ్రంథాలనూ గ్రంథ భాగాలనూ వ్యష్టిగానూ సమష్టిగానూ జరిగే చర్చల్లో పెట్టి కుదింపులూ మదింపులూ జరిపిన తరువాత వరుసక్రమంలో వాటిని పాఠ్య గ్రంథనిర్ణాయక సంఘం వారి ముందుంచటం జరుగుతుంది. డిగ్రీ విద్యార్థులస్థాయి దృష్ట్యా ఉచితంగావున్న వాటి ఉత్తమత్వాన్నిబట్టి నిర్ణాయక సంఘంవారు సిఫారసు చేస్తారు. అలా సిఫారసు చేయబడినవే మన తెలుగు పాఠ్య గ్రంథాలు.

ఈ గద్యమంజరి డిగ్రీ మొదటి సంవత్సరం తరగతులకు సిద్ధంచేయబడింది. ఈ గ్రంథ సంపాదకులు శ్రీ పి. వరవరరావు, శ్రీ యం. అప్పలాచార్యులు. పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘంవారి ఆదేశాల కనుగుణంగా వీరు ఈ గద్య మంజరిని సమకూర్చారు. ఇందులో పానుగంటి నుండి పాములపర్తి సదాశివరావుగారి దాకా మొత్తం పదిమంది రచయితల రచనల నుండి పాఠ్యాంశాలను ఎన్నిక చేయటంతో పాటు ఆయా రచయితల గురించీ, ఆయా పాఠ్యాంశాల గురించీ సంగ్రహంగా పరిచయాలూ ప్రవేశికలూ వ్రాశారు. సంపాదకులు చేసిన ఈపని అటు అధ్యాపకులకూ ఇటు విద్యార్థులకూ సహాయకారిగానూ మార్గదర్శకంగానూ వుండగలదు. ఇందుకు మరింత దోహదకారిగా అధ్యాపకులు తమ అధ్యాపన విధానాన్ని మలచుకోటంవల్ల విద్యార్థులకు ఎక్కువగా తోడ్పడిన వారవుతారు.

చిన్నయసూరితో, కందుకూరి వీరేశలింగంతో, చిలకమర్తి లక్ష్మీనరసింహంతో ప్రారంభమై పరిపుష్టమైన తెలుగు వచన రచన పానుగంటివారి సాక్షి సంపుటాల నాటికి వస్తువిస్తృతినీ, వైవిధ్యాన్నీ, శైలీవిన్యాసాన్నీ సంతరించుకొన్నది. ఇందులో ఎన్నికచేయబడ్డ వచన భాగాలను చూస్తే రచనలో పరిణామం, విషయంలో వైధ్యం, రెండూ అభివృద్ధి అవుతూవస్తున్న క్రమం తెలుస్తుంది. భాషాసాహిత్య చారిత్రిక జీవిత విషయ వివేచనావికే గాక, భారత జాతీయోద్యమ భావవాహికగానూ, ప్రకృతి శాస్త్రం, తత్వశాస్త్రం సంస్కృతి నాగరకతవంటి విషయాలతోపాటు, అనువాదం– కథవంటి ప్రక్రియలను బలంగా చెప్పగలదిగానూ రచయితలు తెలుగు భాషను ఎలా పోషించుకొంటూ రాగలిగిందీ దిఙ్మాత్రంగానైనా ఈ పుస్తకంచూపగలిగితే సంపాదకుల కృషి సఫలమైనట్లే.

పాఠ్యాంశాలుగా ఎన్నుకొన్న వచన భాగాలను ఈ విధంగా విశ్వవిద్యాలయం పక్షాన పుస్తకంగా ప్రచురించటానికి రచయితలూ, ఆయా రచనలపై స్వామ్యంగల ప్రచురణ కర్తలూ అంతా అడగంగానే అంగీకరించిన విషయాన్ని విశ్వవిద్యాలయం తెలుగు విభాగం పక్షాన కృతజ్ఞతా పూర్వకంగా సంస్మరిస్తున్నాను.

సకాలంలో విద్యార్థులకు ఈ పుస్తకం అందుబాటులోకి రావటానికి కృషిచేసిన సంపాదకులను విశ్వవిద్యాలయం తెలుగు విభాగం పక్షాన అభినందిస్తున్నాను.

సంపాదకత్వం వేరు. ప్రెస్సువని వేరు. దీనికి మరింత నేర్పూ ఓర్పూ కావాలి. ఈ విషయంలో అంత బాధ్యతనూ నెత్తిన వేసుకొన్న శ్రీ యం. అప్పలాచార్యులుగారు అభినందనీయులు.

26-8-82 డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి

గింజలను- బ్రోఁగుచేసికొని- సీమ యినుపరేకు డబ్బాలలో- సామాన్య సంసారులు పడవైచిన పైసలను మూటఁగట్టుకొని- దేశదేశములు తిరిగి- దేహీ దేహీ యని- యాచింపరానివారిని యాచించి జాతీయ విద్యాసేవచేసిన యీ దేశభక్తుఁడిట్లు నవసి నవసి- యరగి యరగి- కృశించి కృశించి- కళాశాల యెట్లు పోషింపఁబడునా యను సంతత చింతచే గుండెపగిలి మరణించి యుండకపోవునే- అహాహా! ధనాధికుల కిప్పుడా త్యాగబుద్ధి కలిగినది!

కాళులరగిపోవ దిరిగి తిరిగి- నోరరగిపోవ- యాచించి యాచించి- తుదకు ప్రాణములను బాసిన మన పరమార్థ దేశభక్తునిపై- మనవారి యనురాగము- నాదరము- నట్లే యున్నవని చెప్పవలసి వచ్చినందులకు మిగుల విచారించుచున్నాను. లక్ష రూపాయల సామాన్య నిధి ననేక లక్షలకధికారులగు వీరు చందాపట్టీతో భిక్షాటన మెందులకు? ఒక న్యాయవాది యంహోబాదు పదునొకండుతోడనో పదునెనిమిది తోడనో యొక్క వ్యాజ్యమున సంపాదించిన మూల్యముతో- బందరు జాతీయ కళాశాల వంటివి మూడు పోషింపఁబడునే! పోనీ అంత మహా త్యాగబుద్ధిలేదు అందులకు విచారింపను. కాని యీ చందాలలో నీలక్షరూపాయలైన జమయగునా? ఈ యుద్రేకము- ఈ పూనిక- ఈ విద్యాభిమానము- యీ దేశభక్తి లక్షరూపాయలు సేకరింపబడువఱకు నిలువఁబడునని యేమి నమ్మకము? నాయనలారా! యిట్టి చర్య మనకుఁగొత్తయా? ఇదివఱకెందఱు దేశభక్తులు మరణింపలేదు. ఎందఱు గుణగణమును వీరు కాహళకంఠములతో వర్ణించి యుండలేదు. ఎంత దేశభక్త్యుద్రేకోత్సాహములతో- వీరు- నిధులను ప్రోగుచేయఁబ్రయత్నింపలేదు? ఎందఱకుఁ జిత్రపటములు- ఎందఱకుఁ బాషాణప్రతిమలు- ఎందఱకు గ్రంథాలయములు- ఎందఱకు శారదానికేతనములు- వీరాకాశగంగాఝురీధోరణితో- నాసపెట్టి యుండలేదు? ఇవియన్నియుఁ బూర్తియైనవా? కొన్ని చందాపట్టీలలోనే సందుకొట్టినవి. కొన్ని విదేశోత్తర ప్రత్యుత్తరములతోడనే- పరమపదించినవి. ఆరంభించిన పనులు- కొన్ని పునాదుల గోఁతులతోడనే పూర్తియైనవి. కొన్ని కట్టడములు సగము లేచి చచ్చినవి కొన్ని ఆర్పతునటువారి యగస్త్యాపోశనముతో నంతరించినవి.

పూర్తియైన వొకటి రెండున్నచో నవి మూసిపెట్టబడినవి. పాడుపెట్టఁబడినవి. మన దేశభక్త్యుద్రేకములంతే! చెకుముకి శేర్రెటు! త్రాటాకుమంట! కొఱవి దయ్యపు వెలుతురు! నిలువబడుటయేదీ? పట్టుదలయేదీ? నిశ్చలదీక్షయేదీ? తిరిగి కొంతకాలమువఱకు దేశభక్తిలేదు- విద్యాభక్తిలేదు- త్యాగబుద్ధిలేదు. స్వచింతతప్ప

పరచింతయేలేదు. ఈలోపల నెవ్వడో పరమదరిద్రుడు స్వార్థ పరిత్యాగి సత్కార్యా చరణ దీక్షాదక్షుడు- పుణ్యస్వభావుడు- పరమార్థ దేశభక్తుఁడు త్రికరణశుద్ధిగా- నేదో దేశక్షేమమునకై పాటుపడుచుఁ బ్రజాసాహాయ్యమో ప్రజాసాహాయ్యమో యని ప్రపంచమంతయుఁ గోలపెట్టుచున్నాడు. అతని గోలను మనవారెవ్వరైన వినినారా? లక్ష్యపెట్టలేదు. కాని వినకేమి? "వానిపాటులేవో వాఁడు పడుచున్నాఁడు. మన కెందుల"కని యెవరిమట్టునకు వారే మాటాడినయెడల నేమి మునుఁగునోయని బెల్లము కొట్టిన రాలవలె నూరకుందురు. దేశసేవావేశముచేఁ- గ్రిగికాగ్రి- మండి మండి తుదకుఁ గర్పూరమువలె నా దేశభక్తుండుఁ కడతేఱును. "అరెరే! దేశభక్తుఁడంత ఓంచిచాడు. ఆహ్వానములంపుడు. సభలు చేయుఁడు. ఉపన్యాసములారంభింపుఁడు.నడుములు కట్టుఁడు"అని మనవారు మహోద్రేకమున నెంతగందరగోళమైన- నెంత కోలాహలమైన- నెంత హంగామానైనః చేయుదురు. నల్గురైదుగురు చందాలు వేసినారు. అయినది. ఇఁక నక్కడికంటే మనలో మనకీ చిత్రవిచిత్ర చర్య చిరకాలాభ్యస్తమైనది. కావున దీని వైపరీత్యమును- వ్యత్యస్తతను- గ్రహింపలేకున్నాము. కాని దేవతలో- యక్షులో- వైదికర్షులో- మన యీ మహాద్భుతచర్యను బైనుండి యవలోకించినయెడల నీ యాంధ్రదేశమందెవరో ముప్పది నలుబదిమంది తక్క మిగిలినవారందఱు పిచ్చియాసుపత్రి కర్హులేయని వారికి దోఁచునేమో! అట్లు వారికిః దోచుఁనట్లు మనము ప్రవర్తించుచున్నపుడు- వారిననవలసినపని యేమున్నది? అయ్యయ్యో! ఆహిక జ్వరమువలె- దేశభక్తికిఁ బట్టు విడుపు వచ్చిన తరువాత నిఁకనెక్కడి ప్రారబ్ధము! కవియగువాని- నెపుడైన- వీరాదరించిరా? కవి సోమరి. పైగఁ బ్రపంచ జ్ఞానశూన్యుఁడు. దూరదృష్టి రహితుడు. కొనవెఱ్ఱి స్వభావముకలవాడని యాతనిని వీరనేకవిధముల నిందితురు. కట్టుకొనుటకు జీనుగుల గుడ్డకైన గతిలేక, తినుటకొఱకు పూటకంటె గతిలేక- వ్రాసుకొనుటకీకాలమునఁ గాగితమైన లేక- వ్రాసినదేదో యచ్చువేసుకొనుటకసలే దిక్కులేక- ఋణప్రదాతలచే బాధనొంది యొంది యవమానమును బడిపడి- కుశ్శి కుశ్శి- చావవలసినదేకాని ప్రజలలో నొక్క ధనాధికుఁడైనను యాదరించువాఁడున్నాడు? ఆదరణ వలదు- అనురాగము వలదు- ఈ ధనాధికులందఱు తలకొక పుస్తకము గొనినయెడలఁగవికడుపు నిండునే. అట్లైనఁజేయుదురా? ఉహుహ్హూ- తుదకుఁగవి చచ్చినాడు- ఎంగిలి లంఘనములవాఁడెన్నాళ్ళు బ్రతుకఁగలఁడు? శ్మశానములో నింక నెత్తిపోఁతలైన గాకుండానే- మనవారు టౌనుహాలులో నుపన్యాసములే? హా!హా!హా! ధనాధికుల వలనఁదమగతికూడా- నింతటిదేయని యెఱిఁగియుండి బుద్ధి తెచ్చుకోవలసిన కవులు కాఫీతో- ఫలహార

ప్రియతో - గవిస్మృతి గీతాగానములే: సీసపుబొగ్గుపటమే? చిత్రలేఖనమా? యని సభలో మీమాంసలే: పావులాడబ్బులు మొదలుకొని వసూళ్ళే. చందావట్టీ తరువాత గైరువిలియా యయిపోవుచే! వసూలైనంతమట్టునకు - జవాను బత్తెములక్రింద - అరణా బిళ్ళలక్రింద - నంతరించిపోవుచే! అతి కష్టముమీఁద - నతి జాగరూకత మీఁద - మిగిలినదేదైన నున్నయెడల - నే దాక్షిణాత్య చిత్రలేఖరిపిళ్ళయో - మొదలారియో - కొశంబులో వేయుచే! అంతే. ఎవరి విధిని వారు నిర్వర్తించుకొనుచున్నారు. సరి. ఇఁక సరి. ఇదికాక కవిగారి సతీసుతులకు సభవారు సానుభూతి పంపించుట మఱియొక ఘనకార్యము. కడుపుమాడిన కవిగొంతులోఁ గాసంత గంజిపోయని మహానుభావులు - కవి చచ్చిన తరువాత - నాతని సతికి సానుభూతిలేఖలా? శ్రాద్ధపుఁ గర్చులకుఁ బదిరూపాయలు పనికివచ్చును గాని - సానుభూతి లేఖలు సహస్రమైన నెందులకు?

ఇదిగో! మనవారిలో - ననేకుల - దేశభక్తి యిట్టిది. భాషాభిమానమిట్టిది. దేశసేవకానురాగ మిట్టిది. వితరణ విభూతి యిట్టిది. ఉద్రేకమిట్టిది. దీక్ష యిట్టిది! ఆ కోపల్లె హనుమంతరావు పంతులుగారీ స్వభావములోనివారు కారు. ఈ ప్రక్రియలోనివారు కారు. ఆయన మహాధీశాలి. అప్పటి విద్యావైఖరి యాంధ్రుల శారీరక మానసికాధ్యాత్మిక ప్రబోధమున కెంతమాత్రము నుపచరించునది కాదని - చిరకాలము క్రిందనే - కనిపెట్టెను. జాతీయ విద్యావ్యాప్తివల్లనే యిట్టిభాగ్యము దేశీయులకుఁ బ్రాప్తించునను పూర్ణ విశ్వాసముతో - బందరులో నీ కళాశాలను స్థాపించెను. ఆరంభించిన దినమున నాయనకీ మహాకార్యమునందెంత దీక్షయుండెనో - హరి యని ప్రాణము విడుచువఱకాయన కంత దీక్షయేయుండెను. హెచ్చులేదు. తగ్గులేదు. ఎంత నిశ్చల ప్రకృతియో యోజించుకొనుఁడు. ఆకాశగమనములేదు. అధఃపతనములేదు. భగ్గున మండుటలేదు. చప్పున చల్లాఱుటలేదు. అట్టే వికసనములేదు. ఇట్టే సంకోచములేదు. వింధ్య పర్వతమువంటి మనస్థైర్యముకలవాడు. స్వసుఖమునందు వాంఛలేదు. ధనార్జనమందు మనస్సులేదు. యశస్సునందుఁ దృష్టలేదు అధికారమునందభిసంధిలేదు. ఏమియులేదు. ఉన్నదొక్కటే! దేశీయులకు జాతీయకళా ప్రజ్ఞాప్రబోధన యొక్కటియే! మొదటినుండి యదియే ఆ దృష్టితోడనే యవసానమొందినారు. ఆతఁడు మఱెందుల కక్కఱకు రాకపోవుటచే నీబడి పెట్టుకొని కాలక్షేపముచేసి యుండలేదు. దేశ క్షేమమున కితర కార్యమేదియు నింత ప్రధాన సాధకముకాదని దీనిలోఁ బ్రవర్తించినాడు. అతనికట్టి దేశక్షేమాభిలాష - లేకుండు నెడల స్వోదర పోషణాభిలాషయే యుండునెడల - నీసరికి ప్రథమ తరగతి డిప్యూటి

కలక్టరుగానో,- ప్రెసిడెన్సీ మెజిస్ట్రేటుగానో- పనిచేయుచు- దేశీయ సోదరులచేఁ- గంబళ్ళనేఁత నేయించుచునో, బండ్లు లాగించుచునో యుండును. కాక మహారాజుల మరణ శాసన లేఖనమందే పదునాల్గు వ్యాజ్యములు కవకాశములు గ్రిమ్ముదలగాఁ గల్పించి- వానిలోనన్నింటిలో తానే వకాల్తు దీసుకొని- కక్షిదారులకు సఖ్యము గుదరనీయక లక్షలగడించిన- కొందఱు న్యాయవాదులవలెఁదానుగూడ- నేడంతర వుల మహాలక్ష్మి విలాసములలో- వెండిగొలుసుల తూగుటుయ్యాలలోని విదేశ స్త్రీ సల్లాపములతో- వినోదించుచునే యుండును ఈ ధనము ధనముకాదు. ఈ సుఖము సుఖముకాదు. ఈ కీర్తి కీర్తికాదని యాయన నిశ్చయపరచుకొని యాత్రోవఁద్రొక్కు- టయే మానుకొనెను. ఆహా! యంత చిన్నతనములో- నట్టి స్వార్థపరిత్యాగబుద్ధి- యట్టి దేశక్షేమాభిలాష- యట్టి కష్ట సహనశీలము- నట్టి నిశ్చలధైర్యము- నట్టి నిరుపద్రవ దీక్ష- యెట్లాయన కలవడెనో- వార్ధకమున నందఱు విరాగులే. పడుచుఁదనమున విరాగి యగువాడే ప్రతిభాశాలికాఁడా? పడుచుభార్య పైఁట వదలకుండ- గూడఁ గూడఁ- దిరుగవలసిన పడుచువాడు- పైటను వదలిపైచి- బ్రహ్మసూత్ర భాష్యమును గ్రహించినయెడల నాటివిని బళీయనఁదగినదికాదా? ధనముసంపాదించి సుఖపడుటకు- సంపూర్ణ సాధనములు తనయొద్దనుండ దానిని లోష్టప్రాయముగా వర్జించి తాను ప్రాణాహుతులతోడ- తనువు నిల్పుకొనుచుఁ బడరాని కష్టములను బుద్ధిపూర్వకముగ వరించిపడుచుఁ- బరులకుఁ బ్రజ్ఞాప్రధాన మొనర్చువాఁడహాహా! ఎంతమహనీయుఁడో చెప్పవలెనా! భార్యను వదలుకొనవచ్చును. బిడ్డలను వదలుకొనవచ్చును. గృహమును వదలుకొనవచ్చును ఆశ్రమమును వదలుకొనవచ్చును గాని స్వసుఖమును వదలుకొన సాధ్యమగునా? అట్టి యాతఁడేకి! ముందేదో మహా సంతోషము మీఁద విఱుచుకొని పడునని- ఆయన యిట్టి కష్టమును బడెనాఁడా? కాదు. ప్రజలేవో బిరుదములు తనపయి వర్షింతురని స్వార్థపరిత్యాగి యైనాఁడా? కాదు. మోక్ష లక్ష్మి వైభవము తనకు ముందు సంభవించునని యింత పరోపకారశీలుఁడయ్యెనా? నదియుఁ గాదు. మనుష్యజన్మయెత్తుట- మనుష్య సేవను మనఃపూర్వకముగఁ జేయుటకేయని యాయన త్రికరణశుద్ధిగ నమ్మి యట్లాచరించినాఁడు. అందులోఁ బ్రజ్ఞాదానమువంటి దానము లేదని యాతఁడట్లొనర్చినాడు. అంతే- ఆయన విధియేదో యాయన నిర్వర్తించినాడు. స్వార్థ పరిత్యాగమువంటి సద్గుణములేదు. తత్రాపి బాల్యము నుండి ప్రాణావసానము వఱకు స్వార్థ పరిత్యాగ మహిమయొక్క- రీతిగనే నిలువఁబడి యుండుట మహాద్భుతము. సౌఖ్య పరంపరానుభవమైన పిమ్మట మనస్సునకు సౌఖ్యమునందొక విధమగు నేవ జనించుటవలన సౌఖ్యపరాఙ్ముఖత్వమునందుఁగొన్ని ప్రకృతులకుఁ దీవ్రేచ్ఛ యుదయించును పాలకోవా పరిమితిలేకుండాఁ దిన్నజిహ్వకుఁ

బచ్చిమిరెపుఁగాయ యందు వాంఛ జనించును తత్వమున జిహ్వయుఁ జిత్తము నొక్కటేగాని వేరుకాదు. రెండు సంవత్సరములనుండి యార్యావర్తమున స్వార్థ పరిత్యాగ శకముదయించినట్లగుపడు చున్నది. రెండు సంవత్సరములకు రెండు బాలల పొద్దెక్కినట్లు గోచరించుచున్నది. ఇంతలో నచ్చటచ్చట మేఘావరణము కూడా సంభవించుచున్నది. పొద్దులోఁగూడ నచ్చటచ్చట మచ్చలు మఱకలు పొడ కట్టుచున్నవి. స్వార్థపరిత్యాగుల యుఱుములు వినఁబడుచున్నవి మగువల మైఁదీఁగెల నుండి బంగారు పూలవాన కురియుచున్నది ఎదుటినుండి సుడిగాలితో ధూళిరేఁగి నూతన ప్రబోధబింబమును గ్రమ్ముచున్నది. తేజస్సుతో నది వెలుపలఁబడి వెలుఁగు చున్నది కాని యీ నూతన ప్రబోధమున- నేమోకాని కొంత మాయతళుకు గనఁ బడుచున్నది. కొంత పచ్చి బంగారపు మెఱుఁగగపడుచున్నది. కొంత కల్లకాంతి కానఁబడుచున్నది. వయసున బదియైదులు దాఁటి యౌవనమునఁ బదిలక్షలు దాఁటిన న్యాయవాదులు తమ పట్టాలను వదలుకొనుచున్నారు. ఆహాహా! ఎంత సాహస కృత్యమో! ఆర్యావర్తదేశమునఁ బుట్టి- పరబ్రహ్మవేశముచేఁ బరిపూర్ణజ్ఞాననిధులై- ఒక్క యార్యావర్తమునకేకాదు. అఖిల ప్రపంచమునకుఁగూడ నవిలంఘ్య శాసనము లగు వేదములు చర్చించిన పరమర్షుల రక్తము శరీర నాళములందు ప్రవహించు చున్న మీరు- తెల్లవారుసరికి సేతుహిమాచలమధ్యస్థల శతకోటి దేవాలయ ఘంటాం కార వినాద పరిపూరితమైన వాయువును పీల్చుచున్నమీరు- ఏమి వదలుచున్నారు? ఎం బి. సీ. లనా వదలుచున్నారు? మహావ్వా! వీనిని గ్రహింపుఁడని మొదట మీకెవరు చెప్పినారు? కాశికిఁబోయి సీరుల్లిపాయను విడిచితినని గర్వపడుచుంటిరి కాఁబోలు. మొదట మిమ్ము సీరుల్లిని తినుమన్నవారెవ్వరు? నాయనలారా! విడువ వలసినవి ఐ. జె. కె. ఎల్. ఎమ్. ఎన్. కాదు. అరిషడ్వర్గము. దానిని వదలుమని మనకిప్పుడు క్రొత్తగా నెవరైన బోధింపవలయునా? రెండు మూడు వేల సంవత్సర ముల క్రిందట సింధునదీ సైకతములందు- జ్ఞానయోగ బద్ధబద్రులగు ఋషి సింహ ములు వైచిన అంకెలు బ్రహ్మపుత్ర గుహానికేతనముల మ్రోగి- యడ్డుసుడిగా షఱలి- హిమాలయ పంక్తిని పునాదులదఱునట్లు ఢీకొని రైమని దక్షిణాపథముగా వింధ్యపంక్తి నొక్క చెంపపెట్టుపెట్టి- మలయాద్రి నొక్క తన్నుదన్ని రప్పుమని పైకెగిరి మోచేతివాటమున- జర్మనీమీదుగా- పశ్చిమార్థగోళమున మ్రోగుచుండగా- షనస్ప్రుష్టివఱకు మ్రోఁగవలసియుండగా- నాయనలారా! మీకా సింహగర్జనములే వినఁబడుటలేదా? మిమ్మనవనేల? పోనిండు. ఎక్కడికక్కడికే సంతోషము, ఈ మాత్రమైన- స్వార్థపరిత్యాగ మగపడచుచున్నారు. కాని యిందులోనైన దిరుగఁ గలఁతకొట్టు రానీకుఁడు. మాయూర నొకఁడు చెడఁద్రాగి తూలిపడుచుఁ గఱ్ఱఁదీసి

క్రాని మఱియొక కల్లుదుకాణము నొద్దకుఁబోయి యక్కడ ద్రాగుచున్నవారినిఁ జూచి
"గాడిదకొడుకులారా! త్రాగుచున్నారా! కల్లుచుక్క గొంతుమడి దిగినయెడలఁ దలఁ
బగులఁగొట్టెదను. మహాత్ముడు బాబు చెప్పినమాటలేమిరా? మీరు చేయు చేష్టలేమి
రా? కల్లుదెబ్బచేఁ జచ్చెదరా? కల్లుపాయ లావలఁ బాఱవైచెదరా?" యని యెంత
యల్లరియైనఁ జేసినాడు. నాయనలారా! ఆచరణమే ముఖ్యము. ఆలాపము కేవలము
నిష్ఫలము శాంతిసైన్య మనపేరు చేపాటికఱ్ఱవేత్రిటునా? తప్పు నాయనలారా తప్పు
మతముపేరిటి ప్రచారమనుమాట మహావిష్ణు మహాదేవ రధయాత్రావిధ్వంసనమా!
బ్రోనిండు. నాయనలారా! ఈ యంశములు నాకేల? రాజకీయ తంత్రాంశములఁగూర్చి
మేముపన్యసింపఁగూడదని సాక్షియాజ్ఞ. ఇప్పటి ప్రచారమున మతము రాజకీయ
తంత్రము మేళవింపఁబడి యుండుటచేత నీమాత్రమైనఁ జెప్పవలసి వచ్చినది. మా
యుపన్యాసముల కితరవిషయములు సమృద్ధిగాలేవా? మీరు దీర్ఘాయుష్మంతులై యుండి
యపకతవక లాచరించుచున్నంతకాలము మాకుపన్యాస విషయములకు లోటేమి?
మాకా విచారములేదు. ఇంతకును జెప్పదలచిన దేమనఁగా- కోపల్లె హనుమంతరావు
పంతులుగారి స్వార్థపరిత్యాగ మిప్పుడు చెప్పిన స్వార్థపరిత్యాగము కంటె బహు
రంగులఁ బ్రవిమలమైనది, ప్రశంసార్హమైనది, ప్రశస్తమైనది.

## 2. వేమన నీతులు

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

కవితాధార, హాస్యము— వీనికి తోడు వేమన నామము నాంధ్రదేశము నాచంద్రార్క స్థాయిగాఁ జేసినవి. ఇతని నీతులు. ఇహలోకమున ఇతరులకును తనకును సౌఖ్యమును గలిగించునవి నీతులని మొదలే విన్నవించితిని కావున ఇవి నీతులను స్వార్థములని పదార్థములని రెండు తెగలగును. తత్త్వవాదములకువలె ఇతని నీతులకును అనుభవమే మూలముగాని పుస్తకములు గావు. కావుననే యితఁ డెప్పుడును ఇప్పుడును అనేకులన్నట్లు. ఇతనికి పుస్తకములు వ్రాయుటకును ఇతరులకు నుపన్యసించుటకును మాత్రము కావు. మంచి చెడ్డలను రెంటిని తానుచేసి యందలి తత్త్వమును చక్కఁగా నెఱిఁగి యితరులకు బోధించినవాడగుటచే సామాన్య నీతి గ్రంథములలో లేని తీవ్రత యితని పద్యములలోఁ గలదు—

"ఆ. విన్నవానికన్న కన్నవాడధికుండు
కన్నవారికన్న కలియువాఁడు..."

అను మాట యితని నీతులందును అన్వయించును.

నీతులు పదార్థములని స్వార్థములని రెండు తెఱఁగు లంటిని కాని యనేక ధర్మశాస్త్రకారుల మతము పరీక్షించిన నన్నియు స్వార్థములే యగును. పరోపకార మెందుకు చేయవలెను? అని అడిగిన నీకు పుణ్యము వచ్చునని అందురు. పుణ్యమునకు ఫలము ఇహపరలోకములందు సుఖము. ఇట్లే పరుల కపకారము చేసిన పాపము వచ్చును. ఫలము నరకాదులు కావున ఇతరులకు గలుగఁజేయుటకు తనకు దానివలన సుఖము గల్గునను నాశము దుఃఖము గల్గునను భయమును నీతి సామాన్యమునకు మూలముగా మనలో నేర్పడినవి. కావున పదార్థనీతులును స్వార్థములే. 'తనవలన ఇతరులు సంతోషించిన తనకు సంతోషము కలుగవలయును. దుఃఖము కలిగిన తాను దుఃఖింపవలయును' అను నుదారభావమును ప్రజలలో వ్యాపింపచేసిన నీతి గ్రంథములు ప్రాచీనులలో నరుదు ఇట్టి స్వార్థబుద్ధితోనే వారు ఘనమైన నీతికార్యము లెన్నో చేసినారనుట సత్యమే. దానిచే సామాన్యముగా జనులలో నిప్పటికంటె నప్పుడు పరోపకారబుద్ధి యెక్కువగా నుండె ననుటయు నేను మఱచిపోలేను. కాని తనపనిచే

పోలేదు. కాని తనపనిచే ఇతరులకుఁ గల్గు సుఖమునకంటె తనకు కలుగఁబోవు సుఖమునందే దృష్టి ఎక్కువవగా నుండుటచే. ఇట్టి పనులు నిష్కల్మషముగా తృప్తికరముగా నుండవు. ఇప్పుడు సర్కారివారి బిరుదులనాశించి సత్రములు గట్టించువానికి ఆ బిరుదు లభించిన తరువాత ఆ సత్రము గోడలెప్పుడు పడిపోయినను చింత యక్కరలేదు కదా? ఇట్లే, స్వర్గాదిసుఖముల నాశించువారికి, ధర్మశాస్త్రములందే పరోపకారము చేయవలెనని చెప్పబడినదో యదిమాత్రము చేసినఁ జాలును. తక్కిన వక్కరలేదు. అదిగూడ ఎంత సులభము చేసికొనుటకు సాధ్యమో యంతయు చేయుదురు గోదానము చేసినపక్షమున అది పాలుపిండినను, ఎండినను, మన స్వర్గలోకపు త్రోవకడ్డముగానుండు వైతరణీ నదిని దాఁటించుటకై మనకు అక్కడి దివ్యగోవు సిద్ధముగా నిలిచియుండును. కాని గోవులే లేనప్పుడు దానికి బదులు సువర్ణదానము చేయవచ్చునని ధర్మశాస్త్రములే కలవు. సువర్ణము లేనప్పుడు వెండి కావచ్చును. ఇంతే వెండి యీయవలయునని నిర్ణయము లేదు. ఇన్నాళ్లవఱకును రెండణాల రూకము వెండిదే. అదిలేనప్పుడు రెండణాల రాగి నాణెములు. వానిలో ఒకటి రెండు తగ్గినను బాధలేదు కట్టకడపట నది యొక బొట్టుబిల్ల క్రిందికి దిగును. కాఁబట్టి ఈ పద్ధతి ప్రకారము ఒక గోవు వెల ఒకబొట్టు: దానిని దానమిచ్చినను గోదానము చేసినట్లే. కాని యీ బొట్టును గూడ మూఁడు దమ్మిడీలుగా పగులఁగొట్టి వచ్చును గదా? మితవ్యయము కులధర్మముగాఁగల వైశ్య శిఖామణి యొకఁడు అది మఱచిపోలేదు. కనుక అతఁడు తాను గట్టించిన సత్రములో భోజనమైన తరువాత బ్రాహ్మణులకు తప్పక నిత్యమును తాంబూలముతో ఒక దమ్మిడి పెట్టి 'సువర్ణ పుష్ప దక్షిణ' సమర్పించుచున్నాడనుట యెఱుఁగుదుము: కాఁబట్టి యిట్టి స్వార్థమైన పరోపకారములలో ఫలమెక్కువ యుండదని చెప్పఁబనిలేదు.

వేమన పరార్థ పీతులందు ఈ స్వార్థదృష్టి చాల తక్కువ. 'ఇంచుకంతబోవ మీశ్వరార్పణమన్న పుణ్యలోకమునకుఁ బోవునతడు.' ఇత్యాదిగా నొకటి రెండు మాటలు చెప్పినను మొత్తము మీద లంచమాసపెట్టియో, భయపెట్టియో, పరోపకారము చేయించుట కతనికిష్టములేదు. పుణ్యము, పాపము అను భావములు మనుష్యులు కల్పించుకొన్నవే కాని దేవుఁడు చేసినవి కాదని యతని మతము—

"ఆ. మేనమామ బిడ్డ మెరసి పెండ్లామాయె
అరవలందు చెల్లెలాయె నదియు,
వలసిన పుణ్యంబు వలదన్న దోషంబు..."

మనుష్యులకు సహజముగా ఇతరుల దుఃఖమునకు, దుఃఖించుట, సుఖమునకు సంతోషించుట. యను నుదాసగుణములును గలవు; కావున అట్టి దుఃఖమును బోఁగొట్టి

సంతోషమును గలిగించుటచే తనకుఁ గలుగు సంతోషమే పరోపకారమందలి పరమార్థము. ఇదికూడ స్వార్థమేకదా యను సూక్ష్మతార్కికుల వాదముతో మనకు పనిలేదు.

ఇట్టిపదార్థ కార్యములలో వేమన్నకెక్కువ యభిమతమైనది ఔదార్యము. ఇతరులు తన్ను యాచించుటకు ముందే దానముచేసినవాఁడే దాతయని యితని యభిప్రాయము. ఈ విషయమం దితఁడు అతివాదియని వెనుకనే విన్నవించితినిగదా? కావుననే యతనికి లోభివారిమీద చాల అసహ్యము పుట్టినది. సాధ్యమైనచో ప్రపంచమందలి లోభులనెల్ల పట్టిచంపినను పాపములేదని యితఁడు తలఁచినట్లున్నది. వారిని చంపుట కితనిమందు——

"ఆ. లోభివానిఁ జంప లోకంబు లోపల
మందు వలదు, వేఱుమతము గలదు,
పైక మడిగినంత భగ్గునఁ బడిచచ్చు..."

ఇంత యసహ్యము నందును హాస్యము లేకపోలేదు. ఇంకను వినుడు.

"ఆ. పిసినివాని యింటఁ బీనుఁగు వెడలిన
కట్టె కోలలకును కాసులిచ్చి
వెచ్చమాయె ననుచు వెక్కి వెక్కేడ్చురా..."

ఇంత యుదారబుద్ధి యున్నను వేమన్నకు పాత్రాపాత్రావివేకము లేకపోలేదు. దానమున కెవఁడు పాత్రము అని నిర్ణయించునప్పుడు ఇతనికి కులము, జాతి మొదలగు వానిమాట యట్లుండనిండు, గుణముగూడ నక్కరలేదు. ముఖ్యమైనది పేదఱికము. అదియున్న తక్కినదేమున్నను లేకున్నను అతఁడు పాత్రమే...

"ఆ దోసకారియైన దూషరికాఁడైన
పగతుఁడైన వేద బాహ్యుఁడైన
వట్టిలేని పేదవాని కీఁదగు నీవి
ధనికునకు నొసంగఁ దగదు వేమ"

అన్నదానమును గూర్చి యతని మతము మొదలే యెఱిఁగితిమి. వీనికి తరువాత కన్యాదానముపై నితని కభిమానమెక్కువ. త్రీప్రజ యిప్పటికంటె పూర్వకాలమందు తక్కువయని కానవచ్చుచున్నది. మఱియు బలవంతులగు మనవారు

అని ధనపాల కవి యఱచెను. వైదిక కర్మములందు శ్రద్ధాభక్తులుగల బ్రాహ్మణులలోనే మాధ్వులు ప్రత్యక్షముగా పశువును జంపుట వదలి, పిండితో పశువునుజేసి కార్యము నెఱవేర్చుచు, అహింసా ధర్మమున తక్కిన వారికంటె నొకమెట్టు ముందు పడిరి. శ్రీవైష్ణవులలో తెంగలవారు యజ్ఞము లనావశ్యకములని త్రోసి వైచిరి. తక్కిన వారిలో యజ్ఞములు చేయువారే యపురూపమైనారు. కాని శాస్త్రమునకేమో యజ్ఞములలోని హింస హింసకాదని చెప్పుకొనుచున్నారు. వేమన్నకీ హింసమాత్రమే కాదు. తన శత్రువును గూడ హింసించుట కిష్టములేదు—

"చంపఁ దగినయట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు చేయరాదు,
పొసఁగ మేలుచేసి పొమ్మనుటె చాలు..."

నిజమే. శత్రుత్వము చావవలయునే కాని, శత్రువు చావవలయునని కోరుట యన్యాయము గదా? ప్రకృతము మనుష్యు లింతదూరము అహింసా వ్రతమును పాలింపఁ జాలరుకాని, యెవఁడిట్లు చెప్పెనో యతనిపేరనే గొఱ్ఱెలు, బఱ్ఱెలు బలి యిచ్చుటకైనను. నిలుపఁ బ్రయత్నించుట వేమన యందలి యభిమానముగల వారికెల్ల ముఖ్యధర్మ మనుటలో సందేహము లేదుగదా!

ఇతని స్వార్థనీతులలో స్వానుభవము. వివేకము ఇంకను ఎక్కువగాఁ గాన వచ్చును. మనుష్యుల కీలోకమందు నెమ్మదిగా బ్రదుకుట కావశ్యకములగు ఓర్పు, వివేకము మొదలగు గుణముల నివి బోధించుచు. నందఱకిని ప్రియములుగా నుండును. చూడుఁడు: శౌర్యము మంచిదేకాని, యిది సమానుల విషయమందు మాత్రము పనికివచ్చును, తనకంటె దుర్బలులైన వారియెడల శౌర్యమును జూపుట పేఁడితనమేయని యందఱు అంగీకరింతురు తనకన్న బలవంతులయెడ బ్రయోగించి చెడిన వానిని జూచి 'బలే'యని మెచ్చుకొనువారు కొందఱున్నను అది యవివేకమను వారే యెక్కువ. వేమనయు నీ వివేకుల గుంపులో చేరినవాఁడే—

"ఆ. ఎదుటి తనబలంబు లెంచుకో నేరక
ఢీకొని చలమున నెదిర్చెనేని
ఎలుగు దివిటి సేవకేర్పడు చందంబు..."

కావున—

"ఆ. అనువు కానిచోట నధికుల మనరాదు,
కొంచెమండు టెల్ల కొదువగాదు,
కొండ యద్దమందు కొంచెమై యుండదా ?..."

ఇట్లే యితఁడు దేవఁడైనను, తన్ను దండించిన యెడల సహింపక తిరుగఁ బడుటయే శౌర్యముగానే తోపవచ్చునుగాని, అట్లు దండించుటవలన తనకు మేలేయగు పక్షమున సహించుకొని యుండుటయే వివేకమని వేమన్న మతము—

"ఆ. అలి మాటలు విని అన్నదమ్ముల రోసి
వేఱ పోవువాడు వెఱ్ఱివాఁడు
కుక్కతోఁక బట్టి గోదావరీఁదునా ?..."

అని స్పష్టముగాఁ జెప్పుట యొకవిధము. ఈక్రింది దంతకన్న బలవంతమైన ధ్వని మార్గము

"ఆ. అలివంక వారు ఆప్తబంధువులైరి
తల్లివంక వారు తగినపాటి
తండ్రివంక వారు దాయాది పగవారు..."

ఇట్లే ప్రపంచమందు పలుకుబడి: మర్యాద సంపాదించుటకు తక్కిన యన్నిటి కన్న ద్రవ్యము ముఖ్యము గావున, దానిని సంపాదింపుఁడని స్పష్టముగాఁ జెప్పుట కన్న ఈక్రింది పద్యమునందలి వస్తుస్థితి కథనము ఎక్కువ ఫలకారి :

"ఆ. కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్య చేత విఱ్ఱవీఁగు వారు,
పసిఁడి గల్గువాని బానిస కొడుకులు..."

ఇట్టిదే మఱియొక పద్యము :

"ఆ. పనస తొనలకన్న పంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱుకురసము కన్న చెలిమాట తీపిరా..."

మఱియు, పట్టి యుపమానములనే చెప్పి, విషయము చెప్పక, వ్యంజింపఁ జేయుట యితని యింకొక విచిత్ర మార్గము—

"ఆ. తిరుమలకును బోవ దురక దాసరిగాఁడు;
కాశికేఁగఁ బంది గజముగాదు.
కుక్క సింగమగునె గోదావరికిఁ బోవ..."

"ఆ. పొట్లకాయ రాయి పొడుగు త్రాటనుగట్టి
లీలతోడ వంకలేక పెరుగు,
కుక్కతోఁకఁ గట్టఁ గుదురునా చక్కగా..."

ఇట్లు ధర్మము, తత్త్వము, నీతి, పరమత ఖండనము మొదలగు నే విషయములు చెప్పినను ఇతని పద్యములందు అనన్య సాధారణమైన సారళ్యము, ధారాళత, చెక్కడపు పని, నిర్లక్ష్యము మొదలగు కవితాగుణములు నిండి యుండును. ఇతని యేపద్యము విన్నను నిలిచి తటాలున ఆప్రక్క తిరిగి యొకమాత్రైన చూడకుండుటకు తెలుఁగు మాటలాడు వాని కెవ్వనికిని సాధ్యముగాదు. ఈ యాకర్షణశక్తి యితనియందున్నంత తక్కిన వారెవరియందును గానరాదు. తాను జెప్పుమాట యితరుల హృదయమునందు పడి జారిపోక యుండే యంటుకొనునట్లు చేయుటయే కవి కితరులయందు లేని భగవద్దత్తమైన శక్తి. దానికి పరవశులై తక్కిన సహృదయు లందఱును ఇట్టిదని చెప్పరాని యొక యానంద మనుభవింపవలయు ననుట సృష్టిసిద్ధమగు అనిర్వచనీయ రహస్యములలో నొకటి. కావి యా సహృదయత్వము గూడ కొంత వఱకు సహజమైనశక్తి. స్వాభావికముగా కవిత్వము, సంగీతము మొదలగు కళలయం దభిరుచి లేనివా రెందరో కలరు. ఆ సహజమగు సహృదయత్వమును చదువు, వివేకము, అభ్యాసము వీనిచే తగిన తోవలో వృద్ధిఁ బొందించుకొని వాసనా పరిపక్వ బుద్ధుల మైతిమేని, యెక్కువ యానంద మనుభవింపఁ గల్గుదుము. అట్లుగాక, నీతి, మతము, నాగరకత, ప్రాచీన సిద్ధాంతములు, మనకన్న బలవంతులగు వారి రాద్ధాంతములు మొదలగు వానికి లోబడి తప్పుత్రోవలో దానిని బోనిచ్చితిమేని యనేక మహాకవుల కవిత్వము మన పాలికున్నను లేనట్లేయగును.

# 3. రెడ్డిరాజుల కాలము వ్యవసాయము - ప్రజలస్థితి

సురవరం ప్రతాపరెడ్డి

రెడ్డి రాజుల కాలములో దేశమును సీమలనుగా లేక నాడులనుగా విభజించినట్లు కానవచ్చును.

ఇట్టి సీమలు దేశమంతటను అనంతముగా నుండెను కాని రెడ్డిరాజులు తమ పరిపాలన సౌకర్యమునకై తమ రాజ్యమును కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, అద్దంకి, ఉదయగిరి, కోట, నెల్లూరు, మాచెర్ల, కందుకూరు, పొదిలి, అమ్మనబ్రోలు చుండి, దూపాడు, నాగార్జునకొండ అని విభాగములు చేసిరి.

పల్లవులు, కాకతీయులు దేశమందలి అడవులను కొట్టించి గ్రామాలను ప్రతిష్ఠించి వ్యవసాయకులకు భూములిచ్చియుండిరి. దీనిని బట్టి క్రీ.శ. ౧౦౦౦ కి పూర్వము కర్నూలు, బళ్ళారి మున్నగు మండలాలు అరణ్య ప్రాంతాలుగా నుండెనని తెలియును. ప్రతాపరుద్రుడు స్వయముగా కర్నూలు సీమకు వెళ్ళి అడవుల గొట్టించి ఇప్పటి కర్నూలు పట్టణమునకు ౧౦.౧౫ మైళ్ళ ఆవరణములోని పల్లెల పెక్కింటిని నిర్మాణము చేసినట్లు ఆ కాలపు శాసనాదుల వలన తెలియవచ్చెడి తెలంగాణములో నూరేండ్ల క్రిందట కూడ అడవులను కొట్టి రైతుల ప్రతిష్ఠించుతూ వచ్చిరనిన ఆ కాలపు మాట చెప్పనవసరములేదు.

ఇప్పటివలె భూములను పట్టాకిచ్చు పద్ధతి ఆనాడు లేకుండెను. భూమియంతయు రాజుదే అను సిద్ధాంతము అంగీకరింపబడి యుండెను. భూమిని ఏడేటకో లేక నియమిత కాలమునకో గ్రామజనుల కిచ్చెడువారు. రైతులు తమకుండు పశువుల లెక్క ప్రకారము కాండ్ల లెక్కతో కలిసి కృషిచేసి సమిష్టిలోనే సేద్యపు వ్యయమును తీసివేసి అనగా పనిద్దరాయగాండ్లకు ధాన్యరూపముగా వారికియ్యవలసిన దిచ్చివేసి ప్రభుత్వమునకు ఇయ్యవలసిన షడ్భాగపు పన్నును తీసియుంచి మిగతది కాడీల ప్రకారము పంచుకొనుచుండిరి ఈ విధమగు సమిష్టి సేద్యములో రాజులు బ్రాహ్మణుల కిచ్చిన ఇనాములు అగ్రహారములు చేరియుండలేదు. సమిష్టి సేద్యపు భూమినుండి మొదలు (అగ్ర) బ్రాహ్మణుల ఇనాముల తొలగించి (హారము) భూమిని సాగుకు తీసికొనుచుండిరి

ఆ కాలములో భూములను కొలుచుటకు "గడి" యను నొక నిర్ణయమగ పొడవు కఱ్ఱను వినియోగిస్తుండిరి. దానిని కేసరిపాటిగడ యనిరి. భూములను కొలుచుటకుగాను శాస్త్రగ్రంథాలు వ్రాసిరి. నన్నియభట్టు సమకాలికుడగు మల్లన అనునతడు గణితశాస్త్రమును వ్రాసెను.

తెలంగాణములో తరీ (మాగాణి) సేద్యము నేటికిని ప్రధానమైనట్టి వ్యవసాయము. అందుచే ప్రాచీనము నుండియు రాజులు, మంత్రులు, సేనానులు, ధనికులు, ప్రజలు— కుంటలు, కాలువలు, చెరువులు విశేషముగా నిర్మించుతూ వచ్చిరి. తరీ సేద్యమునకు మోట— ఏతముద్వారా చెరువుల కుంటలద్వారా నీరిస్తూవుండిరి.

"ఈ యెడ కర్మభూమి యగు
దెవ్వరికైనను బుద్ధి నేర్పునం
జేయగలేదు కాలమెడ
సేసిన నేతములెత్తి కాల్వలున్
పాయలు, కోళ్ళు, నూతులును,
బావులు రాట్నములున్ జలార్ద్రమై
చేయగ నాయెగాక మరి
చేయని నాడవి తామె పుట్టునే"

ఇది తెలంగాణా తరీ సేద్యమునకు బాగుగా నిరూపిస్తున్నది. పలనాటి సీమ నల్లగొండజిల్లాకు దగ్గరి భాగము. మిరియాలగూడా తాలూకాకు ప్రక్కనిది. పలనాటిలో నాపరాళ్ళు విశేషముగా నుండెను. అదేమిటో అచటి చెన్నుని మహిమనో యేమో ఆకాశాన మేఘము ఆవరిస్తే చాలు నాపరాలలో విత్తిన యావనాళములు ఫలిస్తూ ఉండెనని క్రీడాభిరామకర్త యీ విధముగా ఆశ్చర్య పడెను.

"చిత్రము గూర్చి మాచెరల
చెన్నుడు, శ్రీగిరి లింగమున్ కృపా
యత్తతతోడ ముల్కి విష
యంబునకా, మహిమంబు చెల్లె, గా
కుత్తరలోన మింట జల
ముట్టిన మాత్రన, నాపరాలలో
విత్తిన యావనాళ ఫలివృద్ధి
ఫలించుట యెట్లు చెప్పుమా !"

ముల్కి విషయమన ములికినాడు. మహబూబునగరు, కర్నూలు, గుంటూరు ప్రాంతాలందలివే. అయినను పలనాటిలో రేగడిభూమియు విశేషముగా నుండెను. అందుచేతనే అక్కడ జనులందరు జొన్నలనే పండించి తినుచుండిరి.

"జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు జొన్నలెతప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నగ పల్నాట నున్న ప్రజలందరకున్."

"చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జ జొన్న కూళ్ళు సర్పంబులను తేళ్లు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు"

"రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రిండైన జొన్నకూడే కుడుచున్."

ఈ పరిస్థితులు రాయలసీమకును వర్తించును. ఇక తూర్పుతీర మందుండు కృష్ణా గోదావరి జిల్లాలలోను నెల్లూరు జిల్లాలలోను విశాఖపట్టణము జిల్లాలోను వ్యవసాయ పరిస్థితు లెట్లుండెనో తెలిసికొందము. శ్రీనాథుడు కృష్ణాజిల్లాలో నెక్కువగా ఉండి సన్నబియ్యపు టన్నమును బహువిధ రుచ్యాహారములను ఆరగించిన వాడగుటచే పలనాటికి పోయి జొన్నకూడు తినలేక అవస్థపడి లోతులోదొరకు నీటికై భంగపడి పలనాటిని తిట్టివెళ్ళెను. తూర్పుతీర మందలి డెల్టా (లంక) భూములలో ఏటిమడలలో నానావిధములగు వరి ధాన్యములు పండుతూ ఉండెను వడ్లలో అనంతమగు జాతులు కలవు. శ్రీనాథుడు కొన్నిటిని తెలిపినాడు.

గోదావరి లంకలలో బహువిధ ఫలములు సమృద్ధిగా నుండెను తూర్పుతీరము ధాన్యసస్య సంపత్సమృద్ధముగా నుండెనని ఆ కాలమున దేశమును చూచిన జోర్డానస్ (౧౩౨౩-౩౦) అను పాశ్చాత్యు డిట్లు వ్రాసిపెట్టెను.

"తెలుగు దేశపు రాజు బహు ప్రతాపవంతుడు. అతని రాజ్యములో పుష్కళముగా జొన్నధాన్యము వరి, చెరుకు, తేనె పప్పుధాన్యాలు, గ్రుడ్లు, గొర్లు, దున్నలు, సాడి, వివిధములగు నూనెలు, శ్రేష్ఠములగు ఫలములు మరెందును లభ్యముకానట్టివి సమృద్ధిగా లభిస్తున్నవి."

దీన్నిబట్టి ఆ కాలమందలి దేశము చాలా సుఖస్థితిలో నుండెననుటలో సందేహములేదు. కృష్ణా జిల్లాలోనిది కాబోలు కళసాపురము, అరటి తోటలకును, ద్రాక్షా ఫలములకును ప్రసిద్ధముకలదై యుండెను.

రాయలసీమలోని ఎక్కువ భాగము కర్నాట రాజ్యములో చేరియుండెను. అందు పల్నాటిలోవలె ధనిక దరిద్రభేదములేక అందరును దున్నుట, స్త్రీలు వడుకుట, అందరునూ జొన్న రొట్టెలు, జొన్న, సంకటి లేక యంబలి లేక అన్నముతినుట యాచారముగా నుండెను

"చల్లా యంబలి ద్రావితిన్ రుచులు దోసంబంచు వోనాడితిన్ తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుడన్" అని నిరసించినదీ సీమను గూర్చియే.

రెడ్డిరాజుల రాజ్య కాలములో జనులు ప్రభుత్వమునెడ చాలా సంప్రీతులై యుండినట్లున్నది. లేకున్న ఓఢ్ర, కర్ణాట మహల్మాన పద్మనాయకోజ్జృంభణ దండయాత్రలలో నెన్నదో తిరుగుబాటుచేసి యుందురు. ఇందరి ప్రబల శత్రువులను అవలీలగా నోడిస్తూ వచ్చిరనిన రెడ్డిరాజులకు ప్రజావలంబన ముండినదనుట స్పష్టము. ప్రజలపై అక్రమమగు పన్నులు వేసినవారు కారు తుది కొండవీటి రాజగు రాచవేమన ప్రజాబాధకరములగు కొత్తపన్నులు వేయుటచే ప్రజలు తిరుగుబాటు చేసినట్లు కొండవీటి దండకవిలె తెలుపుతున్నది. అతడు పురిటిపన్ను ఒకటి మోపగా ఎల్లప్పయను బలిజ నాయకుడు దానినిచ్చుకొనలేక రాచవేముని చంపివేసిరి.

రెడ్డిరాజుల రాజ్యపతనము క్రీ. శ ౧౪౩౪ ప్రాంతములో నయ్యెను. చిరకాలమునుండి ప్రబల ప్రయత్నాలు చేయుచూ వచ్చిన ఓఢ్ర (ఒడ్డె) రాజులు తూర్పు తీరపు దేశమును గుంటూరు సీమను ఆక్రమించుకొని పాలించిరి.

వారికి ప్రజలపై ప్రీతి లేకుండెను. దేశమునుండి అన్నివిధముల ద్రవ్యమును లాగుకొని పోవుటయే వారి ప్రధానాశయమైనట్లుండెను. కవుల ఆదరణము, కళాపోషణము వారిలో లవలేశమైన కానరాలేదు. అఖిలాంధ్ర పరిపూజ్యుడును, కవిసార్వ

భౌముడును, సార్వభౌమ సమ్మాన్యుడును నగు శ్రీనాథునే వారు కష్టపెట్టిరి. రెడ్డి రాజులలోని పలువురి పాలనలందుండి ద్రవ్యమార్జించి దానిని దొరవలెనే దానముచేసి వారి యనంతరము సహసన్రిమాస జీవియైన శ్రీనాథుడు జీవనార్థమై కొంత భూమిని ౨౦౦ బంగారు టంకాలకు గుత్తకు తీసికొని పంటలు పండక పన్ని య్యలేక అవ మానములంది యిట్లు విలపించెను.

సీ॥ కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా
పురవీధి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రి యుగ్మంబున
తగిలియుండెను గదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురుగొడిగ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిటనుండు నల్లగుండు.

కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలుపెసలు
బొడ్డుసల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు.

ఆనాడు పన్నులియ్యని వారి నెన్నివిధముల కష్టపెట్టుచుండిరో యీ పద్యము బాగా విశదపరచినది. చిత్రమేమనగా క్రీ. శ. ౧౯౦౦ వరకు హైద్రాబాద్ సీమలోని పల్లెలలో పటేలు పట్వారీ లివేపద్ధతులను అవలంబిస్తూ ఉండిరి. ఊరిముందర చావడి యుండెడిది. అందు చేతులకు కట్టెబేడీలు వేయు "కోడాలు" ఉండెడివి. రెండుచేతు లను మణికట్టువరకు రెండుకట్టెల రంధ్రము లందుంచి ఒక వెదురుచీలను (గొడిగను) వాటిని బిగించువారు. మరియు ఎండలో నిలబెట్టి బండలెత్తుట లేక ఊరిముందర నుండు గుండును భుజముపై మోయించుట లేక ఒకపెద్ద మొద్దును గొలుసును కట్టి దానిని కాళ్ళకు తగిలించుట ఇవన్నీ చేయిస్తూవుండిరి. అనగా ఒడ్డెరాజుల సృష్టి దేశ మంతటను వ్యాపించె నన్నమాట. అయితే తటాలున ఒడ్డెరాజులే యీ శిక్షలన్నింటిని ప్రవేశపెట్టి రనుటకాదు. అంతకు ముందును ఇట్టివి యాచారమందుండెనేమో కాని వాఙ్మయములో వాటిసూచన లరుదు. ఒడ్డెరాజాల యపయశస్సు మాత్రమీ శ్రీనాథుని చాటుధార యున్నంతకాలము తెలుగునాట నుండకమానదు.

# 4. అపార పారావారం

—కొడవటిగంటి కుటుంబరావు

అపారమైన సముద్రం విస్తరించి ఉన్నది. మనం సముద్రపు టొడ్డున నిలబడి చూసినట్టయితే కనుచూపుమేర నీరుతప్ప మరేమీ కనిపించదు. అంతటా నీరే. సుందరమై నీలంగా శోభించే ఈ అంతులేని జలరాశి ఉత్తుంగ తరంగాలతో అస్తమానమూ సంక్షోభిస్తూ ఉంటుంది. మన కాళ్ళదాకా వచ్చి విరిగి కరిగిపోయే తరంగం సముద్రం పైన ప్రపంచాన్ని చుట్టివచ్చినదై ఉండవచ్చు. ఒక చిన్న నీటి బొట్టు నాలుకపై వేసుకున్నట్టయితే సముద్రజలం ఉప్పగా ఉంటుందని తెలుస్తుంది. పీతలూ, ఎండ్రకాయలూ అటూ ఇటూ పరుగెత్తుతూంటాయి. రకరకాల గవ్వలూ, శంఖాలూ అలలతో కొట్టుకొని వచ్చి ఒడ్డున పడుతూంటాయి. పల్లెవాళ్ల తెప్పలపైన సముద్రం మీదికి పోయి చేపలు పడుతూంటారు. ప్రయాణీకులనూ, సరుకులనూ తీసుకొని నౌకలు రేవులను చేరుతుంటాయి. ఇతర ప్రాంతాల కనిపించని కొన్ని రకాల సముద్రపు పక్షులు తాపీగా సముద్రంపైన ఎగురుతూంటాయి. కొంతమంది తమ విహార నౌకలలో తేలిపోతూంటారు. జ్ఞానదృష్టిగల మరికొందరు సముద్రాన్ని గురించి పరిశోధనలు సాగిస్తారు. పిన్నలేమిటి, పెద్దలేమిటి, స్త్రీలేమిటి, పురుషులేమిటి, సమస్తమైన వారూ సాయంకాలం వేళల సముద్రతీరాన చేరి ప్రాణానికి హాయిగొల్పే చల్లగాలిలో మైమరచి పోతారు. చిన్నపిల్లల మాట చెప్పనే అక్కర్లేదు. వాళ్ళు ఇసుకలో పిచ్చుక గూళ్ళు కట్టుకుంటారు.

సముద్రం చూసి ఆనందించటానికేనా ? అది చేపలుపట్టే సరస్సు మాత్రమేనా? నౌకలు ప్రయాణించే రహదారి మాత్రమేనా ? ప్రకృతి మాత అలలు ఎగురవేస్తూ ఆడుకునేటందుకు క్రీడారంగమేనా ?

సముద్రం అనేక అద్భుతాలతో కూడినది. అది మన తల్లులందరికీ తల్లి. అది జీవరాశికి ఆధారమూ, జన్మభూమీ కూడా. మానవులకు కావలసిన సంపద దానినుంచి ఎంత తీసినా తరగకుండా వస్తూనే ఉంటుంది, అందులో పర్వతాలున్నాయి, మైదానాలున్నాయి, లోయలున్నాయి. అగ్నిపర్వతా లున్నాయి. అక్కడ ౧౦ం వేల రకాల

ప్రాణులు జీవిస్తున్నాయి. సముద్రమొక బ్రహ్మాండమైన క్షేత్రమనవచ్చు. అక్కడ అనేక రకాల వస్తువులు పెరుగుతాయి. సముద్రంలో గనులున్నాయి. వాటినుంచి మనకు బంగారమూ, వెండీ, రాగీ, నికల్ మొదలైనవి లభిస్తాయి.

పెరిగిపోతున్న జనాభాకు కావలసిన ఆహారమూ, లోహాలు సముద్రం నుంచి లభించనున్నాయని శాస్త్రజ్ఞులంటున్నారు. సముద్రం నుంచి సమగ్ర ప్రయోజనాలు సాధించడంలో ఇకముందు వివిధదేశాలు ఒకదానితో ఒకటి పోటీచేస్తాయని కూడా వారు చెబుతున్నారు.

ఉక్కు ఉత్పత్తిచేయడాని కవసరమైన కోబాల్ట్, రాగి, నికల్, మాంగనీజు లోహాలు పసిఫిక్ మహాసముద్రం అడుగున ఉన్నాయి అట్లాంటిక్ మహాసముద్రం అడుగున చేపలకు ఆహారంగా పనికివచ్చే ఫాస్ఫేటు శిలలున్నాయి.

సముద్రం అడుగు ప్రాంతాన్ని చూతాం, మన పల్లెపట్టుల ఉండే పంట పొలాలలాగ అది సారవంతమైనది. అక్కడ కూరగాయలనూ, ఆహార పదార్థాలనూ సాగుచేయవచ్చు. జపానులోని కొన్నినిర్దిష్ట సముద్ర ప్రాంతాలలో సముద్రపు పాచి [ఆల్గే]ని సాగుచేస్తున్నారు. ప్రభుత్వం ఈ పంటపై పన్ను విధిస్తున్నదంటే ఈక్రమ ఎంతగా అభివృద్ధి అయినదీ మనం గ్రహించవచ్చు. ఈ పాచినుంచి చాకలేట్ లూ, రుచికరమూ, పుష్టికరమూ అయిన రసాలు తయారుచేసి విక్రయిస్తారు. వాటిని అమెరికాకు, యూరపుకు, ఎగుమతి చేస్తారు.

యూరపులోనూ, జపానులోనూగల సముద్రాలలో ముత్యపు చిప్పలను పెంచు తున్నారు ముత్యపు చిప్పలను తీగ వలలలోపల కొయ్య పలకలలో వేళ్లాడగట్టి అవి ముత్యాలు పొదిగేలాగు చేస్తారు. హెరింగ్ అనేజాతి చేపలనుంచి నూనెతీసి, మిగిలిన దానిలో ఒకవిధమైన రొట్టె తయారుచేస్తారు.

ప్రమాదకరమైన రేడియో ధార్మిక శక్తిగల వ్యర్థ పదార్థాలను విసర్జన చెయ్య డానికి సముద్రం నిరపాయమైన స్థలంగా భావించ బడుతున్నది. ఆ పదార్థాలను కాంక్రీటు పెట్టెలో ఉంచి సముద్రపు లోతులలోకి దింపుతారు

సముద్రంలో ఎన్ని వింతలైనా ఉన్నాయి. సముద్రం అడుగున అనేకమైళ్ళ నిడివిగల బ్రహ్మాండమైన గుహా సురంగాలున్నాయి. సముద్రం అడుగున గొప్పగొప్ప

నదులున్నాయి. సముద్రం లోపల నదులెలా ఉంటాయని మీరాశ్చర్య పడవచ్చు. సముద్రంలో అనేకచోట్ల వేగవంతమైన ప్రవాహాలున్నాయి. అవి మహత్తరమైన గంగా ప్రవాహం కన్నా వెయ్యిరెట్లు వేగం కలవి.

భూమియొక్క పైభాగంలో 71 శాతం సముద్రం ఆక్రమించి ఉన్నది మన భూఖండాలు సముద్ర జలంలో తేలుతున్నాయని కూడా అనవచ్చును. కొన్ని ప్రాంతాలు సముద్రంలో మునిగి పోవడమూ, మరికొన్ని చోట్ల సముద్రంలో నుంచి భూమిపైకి రావడమూ సాధారణంగా జరిగేదే.

సముద్రం యొక్క సరాసరి లోతు 2.4 మైళ్ళు. సముద్రంలో కొన్నిచోట్ల ఉండేలోతు ఎవరెస్టు శిఖరం యొక్క ఎత్తును మించి ఉంటుంది. ఎవరెస్టు శిఖరం ఎత్తు 29.002 అడుగులు. పసిఫిక్ మహాసముద్రం ఒక ప్రాంతంలో 35,000 అడుగుల లోతున్నది అంటే ఎవరెస్టు శిఖరాన్ని మొదలంటా పెళ్ళగించి ఆసముద్ర ప్రాంతంలో పడవేసినట్లయితే, అది సముద్ర మట్టానికి ఒకమైలు దిగువగా ఉంటుం దన్నమాట.

తుఫానులూ, మంచూ, శీతోష్ణస్థితీ సముద్రం అధీనమై ఉంటాయి.

దేశం చుట్టూ ఉండే సముద్రం దేశానికి రక్ష. సముద్రమే ఎల్లగా ఉండే దేశానికి సరిహద్దు తగాదాలుండవు.

కాని, సముద్రం దేశాలను విడదీసే సరిహద్దు అనడం కంటె దేశాలను ఏకం చేసే ద్రవం అనడంలో నిజమున్నది.

ఆకాశంలో ఎగిరే విమానాలు సైతం సముద్రం పైన ఆధారపడతాయి. తుఫానులూ. వానలూ, పొగమంచూ కలిగించి విమానయానాలకు సముద్రం అవరోధాలు కలిగించగలదు.

మనం చంద్రుడి పైకివెళ్ళి, అక్కడినుంచి మన భూమికేసి చూసినట్లయితే, భూమి అంతటా సాంద్రనీల సముద్రం ఆవరించి ఉన్నట్లు కనబడుతుంది.

ప్రాణులన్నిటికీ నీరు అవసరం. సముద్ర జలమంతా ఇగిరిపోయే పక్షంలో మన్నూ. దుమ్మూ మాత్రమే మిగులుతాయి. చెట్లు, చేపలూ, మనుష్యులూ జీవించడం సాధ్యం కాదు

మనం సముద్రాన్ని గురించి ఎందుకు తెలుసుకోవాలి? భూప్రాంతం కన్న సముద్ర ప్రాంతం మూడింతలున్నది కనుక; భవిష్యత్తులో అది మనకు ఆహారం అందించనున్న మహాక్షేత్రం గనుక, అది ప్రాణాలను సృష్టించి, పోషించిన తల్లి గనుక; దానిని గురించి తెలుసుకొనడం వల్ల మన జ్ఞానం వృద్ధిచెంది ఆ జ్ఞానం ద్వారా మనం అధిక ప్రయోజనాన్ని పొందగలం గనుక.

మనకు చంద్రుణ్ణి గురించి తెలిసిన దానికన్న సముద్రాన్ని గురించి తెలిసినది చాలా తక్కువ. మనకు తెలిసినది కొంచెం. కాని సముద్రాన్ని గురించి మనకు తెలియనిది అపారం.

అయితే మనకు తెలిసినదంతా వివరించడం కూడా తేలికకాదు. సముద్రం లాగే, సముద్రాన్ని గురించిన జ్ఞానం కూడా అపారమైనది.

# 5. ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు

—శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు

1857 తిరుగుబాటు, ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం ఓడిపోవడంతో బ్రిటిషు ప్రభుత్వం భారత దేశంలో వేళ్ళూనింది. భారత ప్రజలను బానిసత్వంలో అణచి పెట్టడానికి తమ సామ్రాజ్యాన్ని రక్షించుకోవడానికి బ్రిటిషు వాళ్ళు రైల్వే నిర్మాణానికి పూనుకున్నారు.

అదివరకు మన దేశంలో జమీందారీ సమాజం వుంది. వ్యవసాయం, చేతి పరిశ్రమలపై ఆధారపడిన ఆర్థిక జీవితం అమలులో వుంది. జమీందారులు, జాగీర్దారులు, యీనాందారులచే పీడించబడుతున్న రైతాంగం, కుల - మత హెచ్చుతగ్గులతో చీలివున్న ప్రజలు, అజ్ఞానంలో మూఢ విశ్వాసాలతో మునిగి వున్నారు.

రాజుల - నవాబుల జమీందారీ నాగరికతను బ్రిటిషు సామ్రాజ్యవాదుల పెట్టుబడిదారీ నాగరికత జయించింది. మనం బానిసలమయ్యాము బ్రిటిషు వాళ్ళు రైల్వేల నిర్మాణంతో పెట్టుబడిదారీ ఆర్థిక విధానాన్ని ప్రవేశ పెట్టారు. ఈ దేశంలోని ముడి పదార్థాలను చౌకగా కొని తీసుకపోవడం వాళ్ళు ఫ్యాక్టరీ వస్తువులను దిగుమతి చేసి లాభాలకు అమ్ముకోవడం ప్రారంభించారు. దీనితో మన దేశంలోని చేతి పరిశ్రమలు నశించిపోసాగాయి. పెట్టుబడిదారీ విధానంతో పాటు అచ్చు యంత్రాలు, పత్రికలు మన దేశంలో కూడా వెలియసాగాయి.

## వీరేశలింగం యుగం:

పై మార్పులన్నిటి ఫలితంగా నూతన పరిస్థితుల నుండి నూతనాంధ్ర జాతీయ వికాసం ప్రారంభమయింది. ఈ దశను వీరేశలింగ యుగమని పేరిడదాము. పాశ్చాత్య నాగరికతతోను, ఇంగ్లీషు సాహిత్యంతోను ఏర్పడిన సంబంధంవల్ల తెలుగు సాహిత్యం పైన వీటి ఛాయలు పడసాగాయి వీటిని తీర్చిదిద్ది తెలుగు సాహిత్యానికి క్రొత్త అలంకారము చేకూర్చి, మన ప్రజలకు అందచేసి, కందుకూరి వీరేశలింగం పంతులుగారు నిజంగా యుగపురుషులు అయ్యారు.

అప్పటికి మన తెలుగు సాహిత్యం రాజుల, జమీందారుల దయకోసం శృంగార ప్రబంధాలు వ్రాసే స్థితికి దిగజారిపోయినది. మన రాజుల రాజ్యం చిన్నదైనా, అధికారం ఏమీ లేకపోయినా, బిరుదావళి పొడుగ్గా వుంటుంది. అదే విధంగా సాహిత్య రంగంలో పదాడంబరం కోసం తాపత్రయం హెచ్చింది. రెండర్థాలు వచ్చే శ్లేషకావ్యాలు, ద్వంద్వార్థ కావ్యాలతో డ్రిల్లు చేయడం కూడా పరిపాటి అయింది. ఈ విషయాన్ని గురించి సరస్వతీ శారదా విలాపమనే గ్రంథంలో వీరేశలింగం గారే ఇలా చెప్పారు.

క. తెలియదు సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావములేమిన్
వెలబొమ్మలు గాకివి సం
కెలలయి కడునాదు మేనికిన్వెతనించున్.

సీ. దయమాలి తుదముల్లు దలకట్లు నిగిడించి
దీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబు లోపల బాదంబు లిమిడించి
పీదుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుకై బెక్కు ప్రాసంబు లదరించి
పోటుబంటై నన్ను బొడుచు నొకడు
గొందుపదక్కులు గూర్చి నిండించి నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకడు

ఖడ్గ చక్రాది రూపము ల్గానిపించి
వర్ణముల్మాన్చి నను జిక్కుపరచు నొకడు
కుమతులొడలెల్ల విరిచి ప్రాణమ్ముతీయ
నొడలి పసలేక కృశించి యున్నదాన.

ఇట్టి తెలుగు సాహిత్యాన్ని తీర్చిదిద్దడానికి, ఇంగ్లీషు సాహిత్యంలో చూస్తున్న అభ్యుదయ సాహిత్య రీతులను ప్రవేశ పెట్టడానికి వీరేశలింగం గారు పూనుకున్నారు. కాని మొదట్లో వీరుకూడా తమ పాండిత్యగరిమను చూపుకోవడానికి కొన్ని రచనలను వ్రాయకపోలేదు. 'రసికజన మనోభిరామం' అనే శృంగార ప్రబంధం. "శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య నైషధం" నీతి చంద్రికలోని "విగ్రహం, సంధి" లాంటివి పాత

ఫక్కీని వ్రాశారు. కాని అది సరియైన మార్గం కాదని తెలిసికొని ఆ పద్ధతి వెంటనే మానివేశారు.

తెలుగు ప్రజలలో ఉన్న మూఢ విశ్వాసాలను, దురాచారాలను ఖండించుతూ అనేక ప్రహసనాలు వ్రాశారు. వాటిలో సులభశైలి, నిశితమైన విమర్శ ఇమిడి ఉంది. సంఘ సంస్కార ప్రబోధం వుంది. "సత్యవతి" 'చంద్రమతి' అన్న కథలను, రాజశేఖర చరిత్ర అను నవలను వ్రాశారు. వీటిలో తెలుగు ప్రజల జీవితం చిత్రించుతూ తాము కోరుతున్న సంస్కార భావాలను ప్రచారం చేశారు.

రాజశేఖర చరిత్ర తెలుగులో వ్రాయబడిన మొదటి వచన కావ్యం. దీనినే ఇంగ్లీషులో నావెల్ అంటారు. వీరేశలింగం గారు తరువాత మంచి నవల వ్రాసిన వారికి బహుమానాలు ఇస్తామని ప్రకటించారు. పోటీలలో బహుమతి పొందినవే చిలకమర్తి వారి 'హేమలత' రామచంద్ర విజయం' 'అహల్యాబాయి' అను నవలలు.

వీరేశలింగం గారు శకుంతల, రత్నావళి వగైరా సంస్కృత నాటకాలను సులభశైలిలో తెలిగించారు. తాము హరిశ్చంద్ర వగైరా నాటకాలు వ్రాసి నూతన ఫక్కీ నాటకాలను ప్రోత్సహించారు. లంచగొండి తనాన్ని ఖండించుతూ 'వ్యవహార ధర్మబోధిని' అనే వచన నాటకాన్ని వ్రాశారు.

బాలికా పాఠశాలను నిర్వహించి స్త్రీ విద్యను ప్రోత్సహించారు. స్త్రీ విద్య పనికిరాదన్న వారిని విమర్శించుతూ ప్రహసనాలు, వ్యాసాలు వ్రాశారు. వితంతు వివాహాలను సమర్థించుతూ ప్రహసనాలు వ్రాశారు. తాము స్వయంగా ఎన్నో కష్టాల కోర్చి వితంతు వివాహాలను చేశారు. శంకరాచార్యుల ఆంక్షలకు — బహిష్కరణ పత్రికలకు గురి అయ్యారు. భావిపౌరులు కానున్న తమ విద్యార్థుల సైన్యంతో శంకరాచార్యుల సన్యాసుల మూకను ఓడించి వేశారు.

'సత్యరాజా పూర్వ దేశయాత్రలు' లో చక్కని హాస్యరసాన్ని చిత్రించి వీరేశలింగం గారు 'సెటైర్' వ్రాయడంలో కూడా అద్వితీయులని నిరూపించుకున్నారు. 'ఆడ మళయాళం' లో మన సమాజంలో మహిళలకున్న నిర్బంధాలు, యిబ్బందులు మళయాళంలో పురుషులకున్నట్లు చిత్రించి అపుడెంత హేళనగా ఉంటుందో చూపి, తాము కోరే స్త్రీ స్వాతంత్ర్యాన్ని ప్రచారం చేశారు. లంకాద్వీప యాత్రలో జ్యోతిష శాస్త్రాన్ని అపహాస్యం చేశారు.

ఉద్యోగుల లంచగొండి తనాన్ని నిరసించుతూ వ్యాసాలు ప్రహసనాలు వ్రాశారు. పరువు, నష్ట దావాలకు గురి అయ్యారు. కులవిచక్షణ పనికిరాదని నిరూపించుతూ సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేశారు. తమ జంధ్యం తీసివేసి బ్రహ్మ సమాజములో చేరినారు.

తెలుగులో శాస్త్ర గ్రంథాలు లేని లోటు గమనించి శరీరశాస్త్రము, భుగోళ శాస్త్రమును వ్రాశారు. అప్పటికి దొరికిన పరిశోధనల ఫలితాలను అనుసరించి ఆంధ్ర కవుల చరిత్రను వ్రాశారు. తరువాత పరిశోధనలకోసం అనుసరించి యీ పుస్తకాన్ని సవరించుతూ వున్న సమయంలోనే 1919 మే 27 తేదీన కీర్తి శేషులయ్యారు.

వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర సాహిత్యానికి, ప్రజల విజ్ఞానాభివృద్ధికి చేసిన సేవ అపారం. ఒకమాటలో చెప్పాలంటే పంతులుగారు ఆంధ్ర సంస్కృతిలో ఒక నూతన శకం ప్రారంభించారు. జమీందారీ యుగపు సాంప్రదాయాలనే సంకెళ్లతో కునారిల్లుతున్న ఆంధ్ర సంస్కృతికి వీరు పునరుజ్జీవనం పోశారు. 'వీరేశలింగం గారు నవీనాంధ్ర దేశమునకు, ఆంధ్ర వాఙ్మయమునకును యుగపురుషుడు' (రాయసం వేంకటశివుడు "వీరేశలింగం గారే ఒక ఉద్యమం: ప్రజ" (కృష్ణశాస్త్రి)

విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి

పంతులుగారు ప్రారంభించిన సత్సంప్రదాయాలను తరువాత అనేక మంది రచయితలు కొనసాగించారు వారిలో ముఖ్యులు చిలకమర్తి లక్ష్మీనరశింహం గారు. అనేక నవలలు, కథలు జీవితాలు, ప్రహసనాలు, నాటకాలు వ్రాశారు. వారి "రాజస్థాన కథావళి" ఎంతోమంది తెలుగు యువకులలో దేశభక్తిని రగుల్కొలిపింది. హేమలత అహల్యాబాయి చక్కని చారిత్రిక నవలలు. రామచంద్ర విజయం, రాజ రత్నం, నాటి బ్రాహ్మణ కుటుంబాల జీవితాన్ని చక్కగా చిత్రించే సాంఘిక నవలలు. గణపతి మూఢాచారాలను హేళనచేసే హాస్యరస ప్రధానమైన నవల. వీరి నాటకాలు గయోపాఖ్యానం వగైరా ఎంతో జనాదరణ పొందాయి. ఇలాగే అనేక మంది రచయితలు వీరేశలింగం గారి సాంప్రదాయాలను కొనసాగించారు. తానే ఒక సంస్థగా పని చేశారు వీరేశలింగం గారు.

1906లో కొమర్రాజు లక్ష్మణరావు గారు విజ్ఞాన చంద్రికా గ్రంథమాల అను సంస్థను స్థాపించారు. రచయితలను ప్రోత్సహించి అనేక గ్రంధాలను వ్రాయిం

చారు. 'అబ్రహాం లింకన్' 'జీవిత చరిత్రము' 'స్వీయ చరిత్రము వంటి జీవిత చరిత్రలను, విజయనగర సామ్రాజ్యము, రాయచూరు ముట్టడి, పాతాళభైరవి అల్లాహో అక్బర్‌లాంటి గొప్ప నవలలను ప్రకటించారు. భౌతికశాస్త్రము, రసాయన శాస్త్రము, వ్యవసాయ శాస్త్రము, ఆర్థికశాస్త్రము వగైరా సైన్సు గ్రంధాలను తెలుగులో వ్రాయించి ఆంధ్ర సాహిత్యానికి గొప్ప సేవ చేసారు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాన్ని గొప్ప ఆశయాలతో ప్రారంభించారు. మూడు భాగాలను మాత్రము ప్రకటించ గలిగారు, దురదృష్టవశాత్తు స్వల్ప వయస్సులోనే (46 యేండ్లకు) 1923 జులై 13వ తేదీన మరణించారు,

'విజ్ఞాన చంద్రిక'ను అనుసరించుతూ తెలుగు దేశంలో అనేక గ్రంథమాలలు బయలుదేరాయి. ఆంధ్ర ప్రచారిణీ, సరస్వతీ, వేగుచుక్క వగైరా అనేక గ్రంథ మాలలు విరివిగా నవలలను ప్రకటించాయి. ఇంగ్లీషు, బెంగాలీ భాషలనుంచి అనువాదాలు విరివిగా రాసాగాయి. ఆంధ్ర సాహిత్యవనంలో వివిధ రకాల క్రొత్త క్రొత్త మొక్కలు అంట్లు దినదినాభివృద్ధి గాంచసాగాయి.

గ్రంథమాలలు మాదిరిగానే గ్రంధాలయాలు (లైబ్రరీలు) గ్రామ గ్రామాన వెలిశాయి. విరివిగా గ్రంధాలు అచ్చుగావడం, చౌకగా దొరకడం, సులభశైలిని వ్రాయబడిన నవలలు మొదలైన వచన రచనలు ప్రజా సామాన్యానికి అందుబాటులో వుండటం సాధ్యమయింది. గ్రంధాలయోద్యమం గూడ యిందుకెంతో దోహదం చేసిందని చెప్పాలి.

ఈ సమయంలోనే మచిలీపట్నంలో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రారంభించ బడింది. దానితోపాటు పెద్ద వర్కుషాపు (కర్మాగారం) స్థాపించబడింది. ఇంజనీరింగు, చిత్రకళ, తివాశీనేత వగైరా అనేక శాఖలతో ఒక విశ్వవిద్యాలయం లాగ నడపాలనే ఆశతో పునాదులు వేయబడ్డాయి. ఇంతేగాక మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో (1912-18) ఆంధ్రదేశంలో బందరు పంచదార ఫ్యాక్టరీ, రాజమండ్రి పేపరు మిల్లు, తాడేపల్లి బట్టల మిల్లు వగైరా పరిశ్రమలు మొలకెత్తాయి.

ఈ కాలంలో నూతన జాతీయ వికాసానికి పాటుబడుచున్న రచయితలకు ఆశా జ్యోతి కన్పించేది. భవిష్యత్తును గురించి బంగారు కలలు కనేవారు. అందుకు చక్కని ఉదాహరణ,

దించు లంగరు

"దించు లంగరు దీర్ఘ యుద్ధం
ధర్మపక్షము మల్లి చూపెను
నరుల పీనుగు పెంటపోగుల
నాటి వెలయును శాంతిపక్షము"

వ్యవహార భాషావాదము

నవ్యాంధ్ర భాషకు పునాదులు వేసిన వీరేశలింగం గారు, ఆ పునాదులను విస్తరింప చేసిన విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, చిలకమర్తి వగైరా రచయితలు సులభమైన గ్రాంధిక భాషను వాడారు. ప్రబంధాలలోవి కృతక భాషను వారు వదలివేసినా, సజీవమైన వ్యవహార భాషలో గ్రంథ రచన చేయడానికి అంగీకరించలేదు. విశ్వవిద్యాలయం వారుకూడ వ్యవహార భాషలో వ్రాసిన రచనలను పాఠ్య గ్రంథాలుగా తీసికొన నిరాకరించారు.

ఈ విషయములో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యవహారిక భాషే సజీవమైనదనీ, పూర్వకవుల రచనలలో కూడ భాష కాలానుసారంగా మారుతూ వచ్చిందనీ ఒక ఉద్యమాన్ని లేవదీశారు. గ్రాంధిక భాషను సమర్థించే ఆంధ్ర సాహిత్య పరిషత్తుతో హోరాహోరీగా పోరాడారు. భాషాశాస్త్రాన్ని బోధించి పండితులను ఓడించారు.

ఒకసారి రామమూర్తిగారిని హేళన చేయడానికి ఛాందస పండితులు 'వ్యవహారిక భాష వివిధ ప్రాంతాలలో వివిధ రూపాలుగా వుంటుంది. సర్వులకు తెలిసేదిగా వుండదు' అని ఆక్షేపించారు. 'ఉదాహరణకు— పోకచెక్కలను కొన్నిచోట్ల చెక్కలు, మరికొన్నిచోట్ల వక్కలు అని వాడతారు; కందులు, బేడలు అని వేరువేరు ప్రాంతాలలో వాడతారు; అని ఆక్షేపించారు. దానికి రామమూర్తిగారు నవ్వి "ఆ వస్తువులకు యీ గ్రాంధిక భాషలో సర్వులకు తెలిసే మాటలేవి? చెప్పండి" అని సవాలు చేశారు. పండితులు తెల్లమొగం వేయవలసి వచ్చింది.

వీరేశలింగం గారు తమ అవసాన కాలంలో 1918 లో గిడుగు ప్రతిపాదించిన వ్యవహార భాషావాదాన్ని అంగీకరించారు. వ్యవహార భాషా ప్రచారక సంఘాన్ని, తాము అధ్యక్షులుగా ఉండి స్థాపించారు. కాని తరువాత వీరేశలింగం గారు కొలది మాసాల్లోనే మరణించుట చేత యీ సంఘం పని చేయలేదు.

మూడుకోట్ల తెలుగు ప్రజలు చదువుకోవాలంటే, విజ్ఞానం పొందాలంటే వ్యవహారిక భాషలో పాఠ్య గ్రంథాల రచన అవసరమని గిడుగు రామమూర్తి గారు ఎలుగెత్తి చాటారు.

"సంఘంలో నిరక్షరకుక్షులు ఎక్కువగా ఉన్నంతకాలము సంఘం వృద్ధిలోకి రాదు. సభ్యతన్నది సంఘంలోని భాగ్యవంతులూ, పెద్దలూ, సామాన్య ప్రజలతో పాటు సమానులుగా అనుభవించవలసినదే కాని, తామొక్కరే అనుభవించవలసినది కాదు. ప్రజలలో విద్య వ్యాపిస్తే కాని సంఘం వృద్ధిలోనికి రాదు."

గిడుగు వాదాన్ని ఆచరణలో పెట్టి, చక్కని రచనలు సృష్టించి ప్రజల మన్నన లను పొందిన మహాకవి గురజాడ అప్పారావుగారు వ్యవహారభాషలో "కన్యాశుల్కం" లాంటి గొప్ప నాటకాలు కొన్ని వ్రాశారు. దీనికి దీటైన నాటకం యింతవరకు రాలేదనే చెప్పాలి.

నీలగిరి పాటలు, ముత్యాల సరాలు అనే పాటలు మాత్రం ఛందస్సులో వ్రాశారు. ముత్యాల సరాలులో అప్పారావుగారు వాడినభాష మాధుర్యం, జాతీయత, తెన్గుదనం కలది. మాటలు తూచితూచి వాడినట్లు కనబడతాయి. కన్యక, పూర్ణమ్మ, లవణ రాజుల కల వగైరా కథలను ముత్యాల సరాలలో వ్రాశారు.

వీటన్నింటినీ మించినది అప్పారావు గారి "దేశభక్తి" అనే గేయం. దాని ఒక్కొక్క పాదం నిజంగా ఒక్కొక్క ముత్యం వంటిది. ఈ గేయం ఒక్కటి చాలు అప్పారావు గారిని అమరజీవిని చేయడానికి. భారతదేశంలో అనేక జాతీయ గీతాలు వచ్చాయి. కాని వాటిలో దేనికీ అప్పారావుగారి గీతంలోని భావ గాంభీర్యం లేదు. బంకిం చంద్రుని 'వందేమాతరం' గాని రవీంద్రుని 'జనగణమన' గాని ఇక్బాల్ 'హిందుస్థాన్ హమారా' గాని "దేశమును ప్రేమించుమన్నా" గీతానికి ఏ మాత్రం పోలికకు రాలేవు.

అప్పారావుగారు జాతీయ వాదులను ఎలా హెచ్చరించుచున్నారో చూడండి:

"దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని ఏదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్"

పూర్వుల గొప్పతనం చెప్పుకొని సంతృప్తి పడవద్దంటూ ఏమన్నారో చూడండి.

"వెనుక చూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగెయ్
వెనుకబడితే వెనుకకేనోయ్"

దేశాభివృద్ధిని ఆయన ఎలా కాంక్షించుతున్నారో చూడండి :

"పాడి పంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటు పడవోయ్
తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్ ;

యీసురోయని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నింపవలెనోయ్"

అప్పారావుగారు పెట్టుబడిదారీ నాగరికతలోని బలహీనతను చూశారు. ఓర్వ లేమి పనికిరాదని చెబుతూ యిలా హెచ్చరించుతున్నారు :

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడు పడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

ఐకమత్యంగా ఉండమని కోరుతూ —

"అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్"

అంటున్నారు.

మానవుల కష్టం నుంచే సర్వము ఉత్పత్తి అవుతూందని ఎంత చక్కగా చెబుతారో చూడండి :

"నరుల చెమటను తడిపి మూల
ధనం, పంటలు పండవలెనోయ్"

అప్పారావుగారు తెలుగు ప్రజలకు యిచ్చిపోయిన యీ జాతీయ గీతం నిజంగా మహాభాగ్యం. అది వ్రాసి ఇప్పటికీ 36 ఏళ్ళు గడిచినా కొత్తదనం ఏమీ పోలేదు.

గిడుగు, గురజాడల వ్యావహారిక భాషావాదం ప్రజలలో వ్యాపించింది. నేడు పత్రికలు, రచయితలు వ్యావహారిక భాషలోనే ఎక్కువగా వ్రాస్తున్నారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, విశ్వవిద్యాలయం మాత్రం తమ మొండి పట్టుదల వీడలేదు పిల్లలు చదువుకునే పుస్తకాలు గ్రాంధిక భాషలోవుండి సత్వర విద్యావ్యాప్తికి ఆటంకంగా వున్నాయి. కాని ప్రజలకు సంబంధించి నంతవరకు గిడుగు జయించారు.

గిడుగువారి వ్యావహారిక భాషా వాదం అభ్యుదయకరమైనది. ఆంధ్ర భాషను వ్యాకరణ పండితుల సంకెళ్ళ నుంచి విముక్తిచేసి జీవద్భాషగా చేయడానికి జరిగిన మహత్తర కృషి. గురజాడ అప్పారావుగారు పై భావాలనే 'కన్యాశుల్కం' 'ముత్యాల సరాలు' రూపంలో చిత్రించిన మహా శిల్పి.

## జాతీయ వాదం

పెట్టుబడిదారీ నాగరికతను చూసి ఉత్తేజం పొందిన మన దేశభక్తుల, రచయితల ఆశలు నెరవేరలేదు. మన ఆర్థిక జీవితం పెంపొందలేదు బ్రిటిషు సామ్రాజ్య వాదుల పోటీకి ఓలువలేక పసిప్రాయంలో వున్న మన పరిశ్రమలు దివాలా తీశాయి. పాశ్చాత్య నాగరికత చూపిన ఆశారేఖలు సన్నగిల్లాయి. ప్రపంచాన్ని యుద్ధమనే మారణహోమం లోకి సామ్రాజ్య వాదులు నెట్టుకుపోయారు.

దీనితో మన నాయకుల చూపు మన ప్రాచీనౌన్నత్యం వైపు మరలింది. మన రచయితలు- బానిసలు కాకముందు మనం బ్రతికివున్న రోజుల నుండీ, చరిత్ర లోతుల ఉత్సాహాన్ని పొందసాగారు. ఇది 1905 వందేమాతరం రోజులలోనే రాజకీయంగా వ్యక్తిగత హింసా వాదంగాను, తిలక్‌గారి తీవ్ర జాతీయ వాదంగాను ప్రారంభమయింది. వీటి పలుకుబడి మన తెలుగు సాహిత్యం పైనకూడ స్పష్టంగా కనబడుతుంది.

ఉదాహరణకు రాయప్రోలు సుబ్బారావుగారి ప్రబోధం చూడండి:

"వేదశాఖలు — పెరిగె నిచ్చట
ఆదికావ్యము — అందె నిచ్చట
బాదరాయణ — పరమ ఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా:
"విపిన బంధుర — వృక్షవాటిక
ఉపనిషన్మధు — వొలికె నిచ్చట
విపుల తత్వము — విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా:
"పాండవేయుల — పదును కత్తులు
మండి మెరసిన — మహిత రణకథ"
"లోకమంతకు — కాకపెట్టిన
కాకతీయుల — కదన పాండితి"

చేర్చి పాడమని రాయప్రోలు కోరుతున్నాడు. దీనిలో మన పాత చరిత్ర నుంచి మన ప్రజలలో ఆత్మవిశ్వాసం, గర్వం, ఉత్సాహం పెంపొందించే ప్రయత్నం ఉంది. కాని అప్పారావు గారివలె మనలోని లోట్లను సవరించుకొని "పాడిపంటలు పొంగిపొర్లే దారిలో నీవు పాటుపడవోయి" అనే ఉద్బోధ లేదు.

ఇలాంటిదే విశ్వనాథ సత్యనారాయణ గారి "ఆంధ్ర ప్రశస్తి- ఆంధ్ర పౌరుషము" కూడ. ఐనప్పటికీ ఆ కాలంలో పెట్టుబడిదారీ నాగరికత యెడల వుండే భ్రమలు తొలగి పోతున్నాయి. పరిపాలకులతో పోరాడి దేశ స్వాతంత్ర్యం సాధించాలనే తీవ్ర జాతీయోద్యమం బయలుదేరింది. ఆ సమయంలో పాత చరిత్ర నుంచి ఉత్సాహం పొందడం సహజమే. అందుచే యీ రచనలు కూడా అభ్యుదయకరమైనదే.

కాని దానితోపాటు జమీందారీ యుగపు సాంప్రదాయాల వైపు వెనుకచూపు లేకపోలేదు. దేశ గర్వంతో పాటు హిందూ జాతీయ దురహంకారపు చిహ్నాలు లేక పోలేదు. ఇవి పెరిగి పెద్దవి అగుటవల్లనే తరువాత రాయప్రోలు, విశ్వనాథ గార్లు జమీందారీ యుగపు ఛాందసా లన్నిటినీ సమర్థించుతూ, అభ్యుదయానినే వ్యతిరేకించే వారుగా తయారయ్యారు

ఈ పోకడలో ఉన్న లోటులను పసిగట్టియే ప్రజాకవి గురజాడ అప్పారావు గారు జాతీయ వాదులను యిలా హెచ్చరించారు:

"వెనుక చూచిన కార్యమేమోయ్
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయ్
వెనుక పడితే వెనుకకేనోయ్."

# 6. సాంస్కృతిక పునరుజ్జీవనము

—మామిడిపూడి వేంకటరంగయ్య

విజయనగర సామ్రాజ్య పతనానంతరము కళావిహీనమై పురోగమన లక్షణమును కోల్పోయిన ఆంధ్ర సంస్కృతి ఒక శతాబ్దము నుండి చైతన్యము గలదియై అనేక ముఖముల నభివృద్ధి గాంచుచున్నది. ప్రజల ఆదర్శములు, మనోభావములు, దృక్పథములు సంస్కృతికి ఆంతరంగిక లక్షణములు. వారి ఆచారములు, సంప్రదాయములు, వారు అభిమానించు తత్త్వ గ్రంథములు, సాహిత్యము, వారి గౌరవమునకు పాత్రములైన లలిత కళలు సంస్కృతికి బాహ్య చిహ్నములు. ఈ రెండింటి యందును ఇటీవలి కాలమున ప్రశంసించ దగినట్టియు, గుర్తించ దగినట్టియు మార్పులనేకములు కలిగెను. ఈ మార్పుతో సాంస్కృతిక పునరుజ్జీవనము. దీనిని వివరించుటలో నిట్టి మార్పులకు కారణములు, మార్పులు సంభవించుటయందు తోడ్పడిన సాధనములు, మార్పుల స్వభావము మొదలైన విషయములను తెలిసికొనుట అవసరము.

బ్రిటిషు పరిపాలన కాలమున పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతులతో ఆంధ్ర ప్రజలకు కల్గిన సంబంధము వారి సాంస్కృతిక పునరుజ్జీవనమునకు ప్రధాన కారణమని చెప్పవచ్చును. దీని మూలమున విద్యావంతుల యొక్కయు జనసామాన్యము యొక్కయు జీవితాశయముల యందును మనోభావము లందును మార్పు లనేకము కలిగెను.

పాశ్చాత్య సంస్కృతిలో విశిష్ట లక్షణములు కొన్ని యున్నవనియు, వానిననుసరించి జీవిత విధానమును మార్చుకొనుట వాంఛనీయ మనియు, అనేకులు భావించిరి. వ్యక్తి, స్వేచ్ఛ సమానత్వము, సామాన్య ప్రజల యెడల గౌరవాభిమానములు, ప్రజాస్వామ్యము పట్ల సుముఖత్వము, ప్రాచీనకాలపు ఆచార సంప్రదాయములను విమర్శించు ధోరణి— ఈలాటి లక్షణములు వీరిలో వ్యాప్తిగాంచ సాగెను. వీనికనుగుణముగ సాంఘిక వ్యవస్థలను, రాజకీయ ఆర్థిక విధానములను, ఆధ్యాత్మిక తత్త్వములను సంస్కరించుకొనుట అవసరమన్న భావము అట్టివారిలో ఉదయించెను. మరికొందరు పాశ్చాత్య సంస్కృతి కంటె ఆంధ్రుల యొక్కయు, భారతీయుల

యొక్కయు ప్రాచీన సంస్కృతి ఉత్కృష్టమైనదనియు, దానిని విస్మరించిన కారణముననే జాతికి పతనము సంభవించెననియు, ప్రాచీన చరిత్రను పరిశోధన గావించి ఆ కాలపు సంస్కృతి స్వరూపమును తెలిసికొని, దాని ననుసరించి ప్రస్తుతకాలపు జీవిత విధానమును మార్చుకొనుటయే కర్తవ్యమనియు అభిప్రాయపడిరి. ఆంధ్రుల చరిత్రను గురించి అనేక పరిశోధనలు జరుగుచుండుటకును, అనేక గ్రంథములు బయలుదేరుటకును, ఇదియే కారణము. ప్రజలలో జాత్యభిమానము, స్వాతంత్ర్య పిపాస, స్వరాజ్య మందాసక్తి, ఈ మనోభావము యొక్క ఫలితములే. రాజకీయ స్వాతంత్ర్య మొక్కటే పరమార్థము కాదనియు, యుగయుగముల నుండి ధనికుల దరిద్రుల మధ్య నేర్పడిన తరతమ భేదములను నిర్మూలము గావించి వర్గరాహిత్యమైన సమాజమును నిర్మాణము చేయుటయే సాధించదగిన పరమార్థమనియు మరి కొందరు భావించిరి. ఈ విధముగ కాలక్రమమున గత వంద సంవత్సరముల నుండి భిన్నభిన్న భావములు ఆంధ్రులలో వ్యాపించెను. సంస్కృతి యొక్క ఆంతరంగిక లక్షణములును, బాహ్య స్వరూపమును మారుచుండుటకీ భావ సంచలనము కారణమయ్యెను. సాంస్కృతిక పునరుజ్జీవనము దీని ఫలితము.

దీనిని సాధించుటలో రకరకములైన సంస్థలు, ఉద్యమములు సాధనములై తోడ్పడెను. వార్తాపత్రికలు, విశ్వవిద్యాలయాది విద్యాలయములు, గ్రంథాలయములు పఠన మందిరములు మహిళా సమాజములు, సాహిత్య పరిషత్తులు, సారస్వత సమితులు, సంఘ సంస్కరణ సభలు మతసంస్థలు, ఆశ్రమములు, రైతు సంఘములు, రాజకీయ పక్షములు మొదలైన సంస్థలు నూతన భావములు ప్రజలలో వ్యాపించుటకై చేసిన కృషి అమోఘము. సంస్థలతో పాటు వివిధ రంగములందును ప్రఖ్యాతిగాంచిన మహనీయు లనేకులు గ్రంథములు వ్రాసియు, ప్రచారము గావించియు సాంస్కృతిక పునరుజ్జీవనమున కమూల్యమైన సహాయము గావించిరి.

పునరుద్ధరింపబడుచుండు ఆంధ్ర సంస్కృతి యొక్క స్వరూపము ఇటీవల బయలు దేరిన సాహిత్యమందు విస్పష్టముగ ప్రతిబింబమయ్యెను. సాహిత్యమే దాని బాహ్య స్వరూపమని చెప్పుటలో అతిశయోక్తి యుండజాలదు.

ఈ సాహిత్యమునకును, ఇంతకు పూర్వము వృద్ధిగాంచిన సాహిత్యమునకు గల భేదములను గుర్తించిన యెడల ప్రస్తుత కాలపు సంస్కృతిలోని విశేషములు కొన్ని స్పష్టము కాగలవు. పూర్వకాలపు సాహిత్యములో చాలా భాగము పండితులచే

పండితుల కొరకు రచింపబడినది. అందులో వాడబడిన భాష సులభగ్రాహ్యము కాని గ్రాంధికము. సామాన్య మానవులకు ప్రాధాన్య ముండవలెనను భావ మాధారమైన సంస్కృతిని ఉద్ధరించుటలో సాహిత్యమునకు గ్రాంధిక భాషకంటె వ్యవహార భాష ఉత్తమ సాధన మన్న అభిప్రాయము ప్రాబల్యము గలదయ్యెను. దీని ఫలితముగ నీ కాలమందు గ్రంథములను వ్యవహార భాషలో వ్రాయువారి సంఖ్య అధికమయ్యెను. సమాజములో శిష్టులనియు, ప్రముఖులనియు, పేరుగాంచిన వారేగాక సామాన్య ప్రజలుకూడ సంస్కృతి లాభము ననుభవింపదగిన వారన్న సిద్ధాంతమాచరణ యోగ్య మగుటలో ఇది పటిష్ఠ సాధన మగుచున్నది.

పూర్వ కాలములో గ్రంథములలో అత్యధిక భాగము పద్య రూపమందుండెను ఇటీవలి కాలమున వచన గ్రంథములు విరివిగ రచింపబడుచున్నవి. రస పోషణము భావ ప్రకటనము, ప్రధానోద్దేశములుగ ఎంచబడిన కాలములో కావ్యాది పద్య రచనలకు ప్రాధాన్య ముండుట సహజమే. కాని ప్రస్తుతము ప్రజల మనో భావములు మార్పుగాంచి జ్ఞాన సంపాదనమునందభిలాష వృద్ధి గాంచుచున్నది.

సృష్టిక్రమమును గురించియు. పకృతిని గురించియు, మానవుని గురించియు, మానవుల సంఘము గురించియు. వాస్తవ జ్ఞానము ప్రజలలో వ్యాపింపచవలసియున్న దని గ్రంధ కర్తలు గుర్తించి దానిని తీర్చుటలో పద్యము కంటె వచనము ఉత్తమ సాధనమన్న కారణమున వచన గ్రంథముల నెక్కువగ వ్రాయుచున్నారు. విజ్ఞానకోశములు. చరిత్ర, రాజకీయ ఆర్థిక సాంఘికశాస్త్రములు, విజ్ఞానశాస్త్రములు మొదలగు జ్ఞాన దాయకములగు గ్రంథములు ప్రచారములోనికి వచ్చుచుండుట ఈసందర్భమున గుర్తించ దగియున్నది.

పునరుజ్జీవితమగు సంస్కృతి పద్య రచన రీతులలో కల్గిన మార్పులలో ప్రతి బింబిత మగుచున్నది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, సమానత్వము, వర్గరాహిత్యము. మొదలగు వానికి సంబంధించిన నూతన భావతరంగములను చిత్రించుటకు కవులు నూతన పద్ధతుల ననుసరించుచున్నారు. గేయ కవిత్వమునకును, భావ కవిత్వమున కును, అభ్యుదయ సాహిత్యమునకు ఇటీవల కల్గిన ప్రాధాన్యము దీని తార్కాణము. స్వాతంత్ర్యమునకై జన సామాన్యము పోరాడుచుండిన కాలమందు వారిని దేశాభి మాన పూరితులుగ చేయనుద్దేశించి మహాకవు లనేకులు గేయ రూపమున గీతములను. ఖండ కావ్యములను రచించిరి. దారిద్ర్యము ననుభవించు కార్మికవర్గము వారి ఆవేద

నను వ్యక్తపరచుటలో అభ్యుదయ కవులు ప్రఖ్యాతిగాంచిరి. పాశ్చాత్య సంస్కృతి ననుకరించుట ప్రమాదకరమనియు, ప్రాచీన భారతీయ సంస్కృతి యొక్కటే మనకు శరణ్యమనియు బోధించు ఉద్దేశముతో ననేక కవులు క్రొత్త రచనలను కావించిరి. క్రొత్త, పాతల మధ్య నేర్పడిన సంఘర్షణ మంతయు నిప్పటి పద్య సాహిత్య మందును, నవలలు మొదలయిన రచనలందును చిత్రింపబడియున్నది. సాహిత్యమునకు ప్రజా జీవితముతో సన్నిహిత సంబంధ ముండవలెనను సిద్ధాంతము యొక్క ప్రభావము ఈనాటి సాహిత్యములో వ్యక్తమగుచున్నది. జానపద సాహిత్యము పట్ల శిష్టులీకాలమున చూపుచుండు గౌరవాభిమానములు కూడ నీ సందర్భమున గుర్తింప దగియున్నవి.

సంస్కృతి సాహిత్యమందేగాక లలితకళల యందు కూడ ప్రతిబింబిత మగు చుండును. ఇటీవలి కాలమున శిల్పము తక్క తక్కిన లలిత కళలయందు ఆంధ్ర ప్రదేశములోని ప్రజలు విశేషమగు ఆదరాసక్తులను చూపుట జరుగుచున్నది. సంగీతము వినుటకును, కూచిపూడి నాట్యాది ప్రదర్శనములను చూచుటకును సభలను సమావేశపరచుటయు, ప్రత్యేక సంస్థలను స్థాపించుటయు మామూలగుచున్నది. ఏబది అరువది సంవత్సరముల క్రిందట నాట్య ప్రదర్శనములు అవినీతికి దారితీయు నవి అను అభిప్రాయము సంఘ సంస్కర్తలలో వ్యాపించి యుండెను.

క్రమక్రమముగ నీ యభిప్రాయము మారి నాట్యకళకు సమాజములో గౌరవ స్థానము లభించెను. ఇంతకంటె ప్రాధాన్యము వహించిన లలితకళలలో చిత్రలేఖ నము గుర్తింప దగియున్నది. దామెర్ల రామారావుగారి కాలమందుండి ఆంధ్ర చిత్ర లేఖనములో నూతనశకము ప్రారంభమయ్యెనని విజ్ఞులందరు గుర్తించి యున్నారు.

ఈ విధముగ శతాబ్దికి పూర్వము ప్రారంభమైన సాంస్కృతిక పునరుజ్జీవనము సర్వతోముఖమై వివిధ రంగములలో గుర్తింపదగిన అభ్యుదయమును సాధించ గల్గి యున్నది.

# 7. చైతన్యమూ – ప్రవృత్తి

—శ్రీ పాములపర్తి సదాశివరావు

మనిషి లేకపోతే విజ్ఞానశాస్త్రం లేదు. అలాగే లలితకళలూ లేవు. కళ
మానవుని సృష్టియే. కళ మనిషి యొక్క ఉద్దేశపూర్వకమైన చర్య. కళను మా
వుడు చైతన్యయుతంగా నిర్మిస్తాడు. విజ్ఞానశాస్త్రం, తత్వశాస్త్రం, కళలూ, మానవ
చైతన్యంవల్ల రూపొందినవి .. అయితే, మానవుని చైతన్యం ఎలా రూపొందిన
మానవుడు భావాన్ని చైతన్యాన్ని భౌతిక పదార్థాలనుండి పొందుతున్నాడు. అం
కాని మానవుని చైతన్యమే భౌతికపదార్థాలను సృష్టిచేయటం లేదు. మానవ చైతన్య
ప్రకృతిలో మార్పులను మాత్రమే కల్పించగలుగుతూ ఉన్నది. మానవ చైతన్యాని
కూడా చరిత్ర ఉంది. పశువుల వస్తువివేకానికి మానవ విజ్ఞానానికి భేదం ఉంది
జీవజాతి వివేక పరిణామంలో మానవ చైతన్యం ఒక గుణాత్మకమైనపర్యవసానం
కాబట్టి అది బాహ్యప్రకృతిలోను, చైతన్యపు స్థాయిలోను మార్పులను సాధిస్తుంది
జంతుజాలపు వస్తువివేకం ఒక ప్రవృత్తి మాత్రమే. ఆ వృత్తిలో మార్పూ
వికాసమూ, స్వతంత్రమూ లేవు.

పశుపక్ష్యాదుల వివేకం పరిమితమైనది పిట్టలు గూళ్ళు పెట్టుకుంటవి- చీమల
పుట్టలు పెడ్తాయి. తేనెటీగలు పెరలుకడ్తవి అవి తమ జీవితం కోసం, అవసరా
కోసం, తమ పిల్లలకోసం ఈ పనులు చేయగలవు. వాటి ఈ వివేకం శారీరికావస
రాలు స్వగతి చైతన్యం వరకే పరిమితము అవి తమ జీవిత స్వభావానికి అనుగుణ్య
ముగా మాత్రమే వ్యవహరిస్తవి. వాటికి బాహ్యప్రకృతిని గూర్చి యోచించే శక్తి
లేదు. అవి నూతన వస్తువులను సృష్టి చేయవు. స్వతంత్రించి తమ స్వభావాలను
మార్చుకో లేవు. బాహ్యప్రకృతిని కూడా మార్చివేసి ప్రకృతిని తమకు సాధనంగా
ఉపయోగ పరచుకోలేవు

ఇక మానవుడో? మానవుడు ప్రకృతిలోని వస్తుకోటిని సమన్వయ పూర్వ
కంగా పరిశీలిస్తాడు. ఒకదానితో మరొకదానిని పోల్చి చూడగలడు. ప్రకృతిలో
మార్పులు సంతరించగలడు. క్రొత్తక్రొత్త సాధన పరికరాలను, నూతన వస్తువు
లనూ యథేచ్ఛగా సృష్టిస్తాడు. నిత్య నూతనానుభవాలను క్రోడీకరించు కుంటాడు.
విజ్ఞానశాస్త్రాన్ని నిర్మిస్తాడు. క్రమంగా పురోగమిస్తాడు, ఇలా మానవుని వాస్తవిక
చైతన్యం విస్తృతమైన స్వేచ్ఛతోనూ, అభివృద్ధితోను కూడుకొని ఉంది.

ఈ తరతమ వివేకం పశుపక్ష్యాదులలో లేదు. అది కేవలం మానవుని సొత్తు మాత్రమే— అందుకే మానవుడు ప్రకృతికి 'సౌందర్య సూత్రాలను కూడ' సమన్వయించి వ్యవహరింప గల్గాడు. ఉదాహరణకు: శాస్త్రకారులు అలంకార శాస్త్రంలో భావాన్ని ఉద్దీపన ఆలంబన విభావాలుగాను, సాత్విక, స్తంభన, రోమాంచ, అశ్రు, వైస్వర్య, కంప, ప్రళయ, వైవర్ణ్యస్వేద అను భావాలుగాను, గ్లాని, శంక, నిర్వేద, మద, అసూయా, ఆలస్య, దైన్య, శ్రమ, స్మృతి, మోహ, చపలతా, చింతా, విషాద, సుప్తి, బోధ, ఔత్సుక్య, ఆవేగ, గర్వ, హర్ష, అమర్ష, నిద్ర, మతి, అపస్మార, ఉన్మాద, త్రాస, ఉగ్రత, జడత, వితర్క, అవహిత్థ ధృతి, మరణ, వ్యాధి, క్రీడా సంచారి భావాలుగాను; రతి, హాసశోక, రోష, ఉత్సాహ, భయ, జుగుప్సా, విస్మయ, శ్రమ స్థాయి భావాలుగాను యెంత సూక్ష్మంగా తిలోకించాదో! ఇలాంటి సూక్ష్మమైన తార్కిక జిజ్ఞాసాశీలమైనది మానవుని వివేకం.

మానవుని ఈ వివేకానికో చరిత్ర ఉంది. వందల వేల యేండ్లకు పూర్వం వానరజాతిలో ప్రత్యేకాభివృద్ధి గాంచిన ఆంత్రోపాయిడ్ ఏప్స్ అను ఒక తెగవి భూమధ్యరేఖా ప్రాంతంలో నివసించేవి. వాటి దేహాలపై దట్టమైన రోమాలుండేవి. వాటికి గడ్డాలు, సూక్ష్మమైన చెవులూ ఉండేవి. అవి చెట్లపై మందలు మందలుగా నివసించేవి. చెట్లపైన ప్రాకిపోవుటకు అనువుగా వాటి ముందుకాళ్ళు, నేలపైన నడుచుటకు అనువుగా వెనుకకాళ్ళు ఉపయుక్తమయ్యేవి. ఒక హేమప్రళయం ఫలితంగా చెట్లు అంతరించిపోయాయి. ఆ దశలో క్రమంగా నేలపై తిరుగాడే శక్తిని ముందరికాళ్ళ సహాయం లేకుండా, వెనుకకాళ్ళపై నిటారుగా నిల్చి ఆంత్రోపాయిడ్ వానరాలు సంపాదించుకొన్నవి. అవి అడవి మనుషులుగా మారినవి.

ఈవిధంగా మారే శక్తిలేని మిగిలిన జంతువుల నుండి మానవుడు ఈవిధంగా విడిపడ్డాడు. కాళ్ళతోనడకనూ నేర్చుకున్నాడు. చేతులతో వేర్వేరు పనులు చేయడాన్ని కూడ క్రమక్రమంగా అలవరచుకున్నాడు. (పాలియో లిధిక్) ఆదిమ శిలాయుగం నాటికి రాతి ముక్కలతో ఆత్మరక్షణ సాధనాలగు కత్తులు సిద్ధపరచుకొనే దశకు చేరుకొనేసరికి వందలాది శతాబ్దాల కాలం పట్టినది. ఇదంతా ఊహాకల్పన కాదు. సమాజ శాస్త్రజ్ఞులు ఆధారాలతో నిరూపించిన శాస్త్ర విషయమే.

ఎలాగైనా తరతరాలుగా ఆది మానవుడు తన చేతితో క్రమక్రమంగా క్రొత్త పనులు చేయసాగినకొద్దీ అతని వివేచనలో, పని నిపుణతలో, క్రమక్రమాభివృద్ధి చేకూరినది మానవుని ఆలోచన కూడా వికసించింది.

చేయి మానవుని పనిచేసే సాధనం. ఈ సాధనం ఏర్పడినదీ, బలపడినదీ, అభివృద్ధిగాంచినదీ వేర్వేరు పనుల మూలకంగానే తన అవసరాలు సౌకర్యాలు, ఆకాంక్షల సాధనకై మనిషి తన సాధనమైన చేతితో ఎన్నో ఇతర కొత్తకొత్త సాధనాలను నిర్మించుకున్నాడు దానికి అనుగుణ్యంగా ఒక్క చేతితో మాత్రమేగాక అతని దేహం మొత్తంలోను కండరాలలో, లిగమెంట్స్‌లో, ఎముకల నిర్మాణంలో, తరతరాలుగా మార్పులు కల్గాయి. పుఱ్ఱెలోను పుఱ్ఱెలోని బుద్ధిలోను కూడా మార్పు వచ్చింది. ఇలా సంక్లిష్టమైన పనులు నిర్వహించుటకు అనుగుణ్య అభివృద్ధిని నేర్పును మానవుడు తన స్వంతసొత్తు చేసుకున్నాడు.

మనిషి యొక్క చేయి మాత్రమే అభివృద్ధి చెంది, మిగిలిన అంగాలు అలాగే నిల్చి యుండలేదు. చేయి దేహంలోని ఒకభాగం మాత్రమే. అందుకై చేతి అభివృద్ధితోపాటు మిగిలిన సర్వావయవాలూ అభివృద్ధియైనవి. మనిషి మెదడు కూడా వికసించింది. డార్విన్ ప్రతిపాదించిన ఈ పరస్పర సంబంధితమైన (Correlation of Growth) అభివృద్ధి సూత్రాన్ని ఈనాడు జీవశాస్త్రం అంగీకరిస్తూ ఉంది

మానవుడు తన చేతితో అనేక పనులు చేయసాగినకొద్దీ అతడుపయోగించిన వివిధ పదార్థాల గుణధర్మాలను అర్థం చేసుకోసాగాడు. అంతేకాదు- మానవ శ్రమ శక్తి హెచ్చినది. మనుష్యులు సమష్టిగా పనులు చేయసాగారు. సమష్టి కృషి, సమష్టి రక్షణ. సమష్టి అభివృద్ధి. సమష్టి ఆనందంతోడి సామూహిక జీవనం యేర్పడినది. ఈ సామూహిక జీవనం సామాజిక జీవనంగా పరిణమించినది. మానవుల ఈ సామాజిక స్థితియే వారి సర్వతోముఖ వికాసానికి రాచబాట వేసినది.

సమాజంలో నివసించే ఒక వ్యక్తికి తన మనోభావాలు ఇంకొక వ్యక్తితో వెల్లడించుట అవసరం. అందుకని వట్టి అఱపులకు మాత్రమే అలవడ్డ మానవ (కంఠ) స్వరపేటిక వికసించినది. నోరు ఉచ్చారణను అలవరచుకొంది. నాల్క తిరగసాగినది. పసిపిల్లవాడు నెల, నెలకూ మాటలు నేర్చుకున్నట్లుగానే ఆదిమానవుడూ శతాబ్దాలలో మాటలు నేర్చుకున్నాడు... ఇలా భాషలు అవతరించాయి.

మొదటిది శ్రమ. దాని వెనువెంటనే వచ్చినది మాట, ఈ రెండు పరికరాల క్రమ వికాసమే మానవ జాతి చరిత్రకు రహదారి. వీటి ఆధారం పైననే మేధాశక్తి వికసించినది. అది మానవుని కర్మ, కర్మేంద్రియా లన్నింటికి వికాసానికి సోపానాలు వేసినది.

...శ్రమా, వాక్కూ కలిసి మేధస్సూ, దాని అంగములైన ఇంద్రియములపై వేసిన ప్రభావం మానవుని వివేక పరిణతికీ, పదార్థాల నిర్దిష్ట వివేచనకూ భావంయొక్క సాధారణ కరణరూపక సూత్రీకరణకూ, ఆచరణాత్మక సాముదాయక సంకల్పదీక్షకూ దారితీసినది. ఐతే, ఆ ప్రభావమే తిరిగి శ్రమా- వాక్కుల యొక్క పురోగమనానికి గతితార్కికంగా దోహదం చేసింది.

ఇలా చేతులూ, నోరూ, మెదడూ (ఇంద్రియాలూ) పరస్పర సహకారంతో వికసించినవి... ఇది వ్యక్తిగతంగానే కాదు. వందల- వేల మెదడులు కలసి ఆలోచించినవి. దీనితో మానవుని కర్తవ్యాలు విస్తృతమైనవి. ఆదర్శాలు ఉన్నత మైనవి ఆకాంక్షలు దృఢపడ్డాయి. శ్రమశక్తికూడా నానాగతుల ననుసరించినది. నానా ప్రయోజనాలను నెరవేర్చినది. ఇలా అనేక వైవిధ్యాలకూ కౌశల్యాలకు, ప్రయోజనాలకు, ప్రత్యేకతలకు, ఆలవాలమైన చరిత్రకు పునాదులు పడ్డవి... ఐతే, అక్కడే మానవ చైతన్యం "కళాత్మక" చైతన్యం నిర్మాణాన్ని చేపట్టిన దశ ప్రారంభ మౌతుంది... ఐతే లలితకళల ఈ ఆవిష్కరణానుక్రమాన్ని మరొకచోట చర్చిస్తాము. ఇక్కడ మనం ప్రధానంగా చర్చింపబూనినది, మానవ వికాస పరిశీలననే.

కనుక భావస్ఫూర్తి యొక్క ఇంద్రియానుభవాల యొక్క గతితార్కిక సమన్వయమే ఆలోచనా అనుభూతులతో కూడిన చైతన్య మన్నమాట.

మానవ మేధస్సు వికసించిన కొద్దీ, దాని నిరూపణశక్తీ నిర్ణయశక్తీ హెచ్చిన కొద్దీ, ఇంద్రియ శక్తుల పరిణతి కూడా అవసరమౌతుంది. ఇంద్రియ శక్తుల పరిణతి హెచ్చినకొద్దీ అవి మేధస్సు యొక్క సంక్లిష్టమైన వివేచన శక్తిని పెంపొందిస్తాయి. మానవ విజ్ఞానం ఇలా వికసిస్తుంది.

దీనివల్ల జీవితానికీ, చైతన్యానికీగల అవినాభావం ప్రకటమౌతుంది- కాని కొందరు భావవాదులు ఈ సంబంధాన్ని గుర్తింపలేక కళకు జీవితంతో సంబంధం లేదంటుంటారు. కళ కళకోసమేనని వాదిస్తుంటారు. వారు భావానికీ దాన్నిగూర్చిన అనుభూతికీ మధ్య అడ్డుగోడలు కల్పించి తప్పుడు నిర్వచనాలకు పాల్పడుతుంటారు.

ఉదాహరణకు : పికాసో. ఈయన క్యూబిజం అను పద్ధతిని అనుసరిస్తాడు. ఈ క్యూబిజం అనుభూతికంటే భావస్ఫూర్తికి అధిక ప్రాధాన్యత నిస్తుంది. పికాసో

బొమ్మలు చూస్తే కనులకు ఆనందం కలుగదు. మెదడుకు మాత్రం సందేశం దొరుకు తుందట! ఇలా ఉంది ఈ క్యూబిజం సంప్రదాయం తీరు!!

ఇంకొక చిత్రకారుడు మాటిన్ ఇంద్రియానురక్తికి అధిక ప్రాధాన్యత నిచ్చి భావస్ఫూర్తిని లెక్కచేయడు. అంటే స్వభావాన్ని వదిలి కేవలం స్వరూపారాధనకు పూనుకుంటాడు.

ఐతే ఈ రెండూ వాస్తవికంగా పెడమార్గాలే. ఇలాంటి తప్పుడు సంకేతాలు, సంప్రదాయాలూ, కళను జీవితం నుండి విడిపరచి ఆలోచించడం మూలకంగానే యేర్పడుతుంటాయి. అవి ప్రజల నుండి, సమాజం నుండి దూరం కాకతప్పదు.

చైతన్యానికీ, ఆ చైతన్యాన్నేర్పరచే భౌతిక ఆధారాలకూ గల సంబంధాన్ని గుర్తింపకపోవడం ఇలాంటి పెడదార్లకు మూలమన్నమాట. మనిషియొక్క చైతన్యం పరిణమించింది. నవనవోన్మేషంగా వికసించేదీ, మానవుడు ప్రకృతిని అర్థం చేసు కొని, దానిపై తన ఆధిపత్యాన్ని స్థాపించుకున్న ఈ అనుక్రమం మూలంగానే, మానవుని చైతన్య చరిత్ర మానవుని అభ్యుదయ, స్వాతంత్ర్య చరిత్రయే. ప్రకృతి ధర్మం యొక్క మానవ వివేకమూ, ప్రకృతి శక్తుల అతని వినియోగ క్రమమే అతని స్వాతంత్ర్య చరిత్ర కూడ. ఇదే అవసరాలగుర్తింపు సూత్రం.

కాని చాలామంది ప్రబుద్ధులు అజ్ఞానికీ స్వాతంత్ర్యానికీ ముడిపెడ్తుంటారు. కనులు మూసికొని పరుగెత్తే వారి దృష్టిలో స్వాతంత్ర్యం.

ఉదాహరణకు: లిప్షిగ్ అనే ఒక ఫ్రెంచి శిల్పి కళను విమర్శిస్తూ, ఒక ఫ్రెంచి విమర్శకుడు మోరిస్ రేనాల్ ఇలా అన్నాడు, "ఈశిల్పి లక్ష్యం ప్రవృత్తు లనూ, కోరికలనూ మానవుడు తొలిసారి భూమిపై అవతరించిన దశలో అలాగే భద్రపరచడం."

ఆదిమ దశలోని మానవుని ప్రవృత్తిలో సిసలైన స్వేచ్ఛ అని ఈ రేనాల్ గారి అభిప్రాయం! క్రమ చైతన్య రహితమైన సహజ ప్రవృత్తులే వీరికి స్వాతంత్ర్యం. ఆ నిర్వచనాన్ని చాలామంది 'అమాయకత' అంటూ మెచ్చుకుంటారు. ఇది మానవుని అనాగరిక దశను మెచ్చుకుంటూ అతణ్ణి అనాగరికుడుగానే ఉండాలని

ప్రోత్సహిస్తుంది. ఎందుకని? మనిషిని అనాగరిక దశలో అణచియుంచటం వల్ల శోషణ (దోపిడి లేక మోసం) సులభం! పర్యవసానం ఈ ప్రవృత్తి వాదం అభివృద్ధి నిరోధకమైనదనే!!......

ప్రవృత్తి అంటే ఏమిటి? మిడత దీపాన్ని ఏదో అందమైన వస్తువనుకుంటుంది. దీపం పైకి దుముకులు పెడ్తుంది. రెక్కలు కాలి చనిపోతుంది. అది దాని ప్రవృత్తి. తేనెటీగ పూలనుండి తేనెను సేకరిస్తుంది. దీనికొక శత్రువు ఉంది. దాని పేరు ఫిలాంథస్. తేనెటీగ తేనెను గూటికి చేర వేసుకుంటున్నప్పుడు ఈ ఫిలాంథస్ దాని వెన్నాడి చంపుతుంది... కాని, తేనెటీగ ఈ రహస్యాన్ని అర్థం చేసుకోలేదు. ఫిలాంథస్ తనను చంపడం తేనెకొరకని గుర్తింపదు. ఫిలాంథస్‌ను చూచి తప్పుకోదు కూడ అలాగే తేనె చేరవేసుకుంటూ ఫిలాంథస్ వాతబడి చనిపోతుంది. చెదలుపురుగులు ఆడవాటిని వాటిరంసి (వాసన) ద్వారా గుర్తుపడ్తాయి. ఒక ఆడపురుగుల రసిలో ఒక గుడ్డపడిపి వ్రేలాడగడ్తే దానిపైకి ముసురుకుంటాయి, దారిలో ఆడ చెదపురుగులు ఉన్నప్పటికీ, వాటిని దాటవేపికొని గుడ్డపైకే పరుగులెత్తుతుంటాయి. అలాగే చేపలు ఎట్టిల ఆశతో గాలాలకు తగులుకొనడం, ఒకచేప ఒకసారి గాలంలో ఇరుక్కొని తప్పించుకున్నా సరే, మరొకసారి గాలానికి ఎట్టకన్పిస్తే, తిరిగి దాన్ని ఆశతో మ్రింగివేయబోయి గాలంలో చిక్కుకుంటుంది. ఎలుకలు ఎరకోసం బోనుల్లో పడ్తాయి. మళ్ళీ మళ్ళీ అలాగే ఎర కన్పిస్తే బోనుల్లోకి దూరుతునే ఉంటాయి. ఇలా ఉంటుంది చైతన్యంతో విడిపడ్డ ప్రవృత్తి అంటే!...

కావున చైతన్యాన్ని వదిలిపెట్టి ప్రవృత్తిని ఆశ్రయించడమంటే మానవుడు తిరిగి జంతుదశకు, దానికంటె అధమమైన కీటకదశకు దిగజారడమన్నమాటే. అందుకే చైతన్యరహితంగా, ప్రవృత్తికి దాసులై ఇదే స్వాతంత్ర్యమని భావించి సంతోషపడటం వట్టి అవివేకమే...

# 8. అందరికీ తెలిసేటట్టుండాలి

—తాపీ ధర్మారావుగారు

పాశ్చాత్యదేశ భాషలలో నున్న మంచి గ్రంథాలలోని భావం ఎంతలోతయిందయినా, ఎంత తేలికయిందయినా వాటిలోని విషయం ఎలాంటిదయినా— ఒక చిత్రకారుని జీవితమే కావచ్చు, ఒక కూలివాని బ్రతుకు కావచ్చు. ఒక మహాతెలివైనవాడి విషయం కావొచ్చు. అది వేదాంతం కావొచ్చు, దాంపత్యం కావొచ్చు, ఏదయినా సరే— ఆ గ్రంథాలలోని భాష ఎలాంటిది అన్న ప్రశ్నయే మనకు ఇప్పుడు ప్రధానం.

(భావాన్ని గురించి, విషయాన్ని గురించి ముందు చెప్పవలసి ఉంది. కాబట్టి ఇప్పుడు భాషే చూస్తాము)

గ్రంథం నార్వే భాషది కానీయండి, రషియా భాషది కానీయండి, అన్నిటిలోనూ ఒక్క ముఖ్య సూత్రం ఉంది. నార్వే దేశంలోని ఒక మహాగ్రంథం తీయించండి— సాధారణ గ్రంథం కాదు. ప్రపంచంలోని సారస్వత సూత్రాన్ని మార్చివేసిన గ్రంథం తీయించండి. నార్వే దేశంలో ఉండే వాళ్ళని ఒక నూరుగురిని తీయండి. చదువుకొన్న పట్ట పరీక్షవాళ్ళని కాదు, వీధులలో తిరుగుతున్న వాళ్ళని, కూలీనాలీ చేసుకొని బ్రతుకుతున్న వాళ్ళని తీయండి. ఈ నూరుగురికి నార్వేభాష మాతృభాషగా మాత్రం ఉండాలి, ఈ నూరుగురిని కూర్చోపెట్టి ఆ మహాగ్రంథం చదివించండి. ఏ అయిదుగురికో తప్ప తక్కిన వాళ్ళందరికీ ఆ గ్రంథంలోని భాష చక్కగా బోధపడి ఉంటుంది. అందులోనివి వాళ్ళకు తెలిసిన మాటలుగానే ఉంటాయి. పుస్తకం అంతటిలోనూ ఒక పది మాటలు మాత్రం కొత్తవి ఉండవచ్చు.

భావం అంత సులభంగా బోధపడక పోవచ్చు. కాని మాటల కష్టం వాళ్ళకు చాలావరకు ఉండదు. వాక్యాలు బోధపడే ఉంటాయి. నిఘంటువులు చూడవలసిన అవసరం పుస్తకం అంతటిలోను ఒక పదిసార్లు ఉండవచ్చును. భాష అంత సులభంగా బోధపడుతూ వుంటుంది. ఈ సంగతే ఆయా భాషలలోని విమర్శనలవల్ల చక్కగా తెలుస్తుంది.

అంటే ఏమిటి? గ్రంథం ఏ భాషలో ఉంటుందో ఆ భాషే మాతృభాషగా కల వాళ్లకు, నూటికి 90, 95 మందికి మాటలకష్టం వుండకూడదు. ఇదేసూత్రం అని బోధపడుతుంది, ఇలాగే రషియా, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా మొదలైన దేశాలలో గూడా ఉన్నదని రుజావు చేయవచ్చును. భావంలో కష్టం వున్నా లేకపోయినా భాషలో మాత్రం కష్టం వుండదు, వుండకూడదు.

ఇంగ్లీషులోను:

ఇంగ్లీషులోను కూడా మహాకవుల గ్రంథాలలో ఈ గుణం కనిపించుతూ వుంది. షేక్స్పియర్ మహాకవి 'దయ'ను గురించి వ్రాసిన మాటలు చూడండి :

The quality of mercy is not Strained;
It drops as gentle rain from heaven
Upon the place beneath, 'Tis twice blessed',
It blesses him that gives and him that takes.

మాటల కష్టమేమయినా ఉందా? ఇంగ్లీషు మాతృభాషగా గలవాడి కెవడికి ఈ మాటలు బోధపడవు? నిఘంటువులు చూచే అవసరముంటుందా వాడికి? భావమా, ఎంత గొప్పది! ఆ భావాన్నే విప్పి వ్రాయాలంటే మహాగ్రంథం మరొకటి తయారై పోవలసినంత పెద్ద భావం. మాటలలో తేటలు!

Life is real, life is earnest;
The grave is not its goal,

అన్నమాటలు చూడండి. ఏమైనా కష్టముందా? భావంలో కష్టముండవచ్చును. అది అందరికీ అందుబాటులో లేకపోవచ్చు. కాని మాటలు కష్టంలేదు. వాక్యాల కర్థం తెలుస్తూనే ఉంటుంది.

To be or not to be - that is the question.
ఇది చూడండి.

అస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్,
ఇది చూడండి.

నోబెల్ బహుమానాన్ని పొందిన రవీంద్రనాథ టాగూర్ గారి గీతాంజలి కూడా— తత్వాలయినప్పటికీ— మాటల కష్టం ఏమీ లేకుండా బంగాళీ మాతృభాషగా గల్గిన

వాళ్ళందరికీ తెలిపినట్లే ఉన్నదిగాని, మాటల గారడీలతోనూ, పదాల సర్కసులతోను లేదు, భావాలంటే చాలాకష్టంగా ఉండవచ్చు. మాటలబాధ, వాక్యాలబాధా ఉండదు.

## రైల్వే పుస్తకాలు

ఇంగ్లీషులో గూడా ఇప్పుడు వస్తూవున్న ఉత్తమ గ్రంథాలలో భాష కఠినంగా ఉండడం లేదు. నిజం చెప్పవలసివస్తే రైల్వే పుస్తకాలలో ఉన్నపాటి మాటలకష్టం గూడా వాటిలో లేదనే చెప్పాలి. ఈ రైల్వే గ్రంథాలు మూడురోజుల ముచ్చట్లు మూడు గంటలలో చదివి పారేయవలసినవి. మళ్ళీ చూడడానికి కూడా వీటికి అర్హత ఉండదు. అటువంటి వాట్లలో ఇంకా కొంచెం మాటల దడబడలు కనబడతాయి. కాని లోకంలో సాహిత్యంలో కొన్నాళ్ళు నిలవదగిన పెద్ద వ్రాతగాళ్ళపుస్తకాలలో కనబడనే కనబడదు.

ఇంగ్లీషువాళ్ళు అందరూ మాటలాడుకొనే భాషలోనే అట్లాంటి అన్వయంతోనే వ్రాస్తారు. పాత వ్యాకరణాలకి కొంచెం తప్పిపోతూ వుంటారు కూడాను. ఏమని ఒకవేళ వాళ్ళని అడిగితే ప్రజలనడగండి అంటారు. ప్రజలు ఆ వ్యాకరణ సూత్రాన్ని పాటించనప్పుడు మీరు సూత్రం మార్చుకోవలసి వస్తుందంటారు గూడాను గట్టిగా అడిగితే పెద్దవాళ్ళ వ్రాతలు అలాగ తేలికమాటలతోనే ఉంటున్నాయి. తులసిదాసు రామాయణమూ ఇలాంటిదే. చిన్నవాళ్ళు బడబడిలమీద పడతారు. కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా అన్నమాట చాలా నిజమని అనిపిస్తుంది. ఎంత కఠినమైన సంగతులనయినా ఎంత చిక్కుకున్న సమస్యనయినా ఈ గొప్ప వ్రాతగాళ్ళు అంత తేలికగా చెప్పగలరు. చిన్నచిన్న మాటలతోనే మహాకష్టమయిన విషయాలని తేటపరుస్తారు. అదే వాళ్ళలోని గొప్పతనం. ఆ కష్టవిషయాలన్నీ వాళ్ళ చేతులలో చిక్కి ఉంటాయి, అవి వాళ్ళకు చక్కగా బోధపడి ఉంటాయి, తెలిసిన దానిని చెప్పడం ఎప్పుడయినా సులభం కదా!

ఒక ఉదాహరణ:

నా మిత్రులు పెద్ద విద్యా పీఠములో ఆంధ్రభాషకు గురువు. పట్టభద్రుడు. ఒక గ్రంథాన్ని ఇంగ్లీషు నుండి తెలుగులోనికి తర్జుమాచేస్తూ ఉన్నారు. నేను వారిని చూడడానికి వెళ్ళినప్పుడు వారు ఉత్సాహంతో నాకు కొంతభాగం వినిపించారు. వినిపించడమే వారికి ప్రధానం కాబట్టి విన్నాను. కొంత భాగం వినిపించిన తర్వాత 'ఎలాగుంది?' అని నన్నువారు అడిగారు.

నేను ఆంధ్రజనుల పక్షాన్ని మాట్లాడుతూ, అంతా అగమ్యంగా ఉంది. మాకు బోధపడాలని వ్రాస్తేకదా మీరు. మాకు బోధపడదానికి" అన్నాను. పాపము వారు నిర్ఘాంతపోయారు. నేను యిలాగంటానని అనుకోలేదు. వారి వ్రాతలో మాటలు కష్టంగా వున్నవనిన్నీ, అన్వయం కష్టంగా ఉందనిన్నీ చెప్పాను. ఇదికూడా ఒక పరిబంధం లాగో టెక్స్టు బుక్కులాగో మాటమాటకీ అర్థం చెప్పి, అన్వయం విప్పి బోధపరుస్తేనే గాని బోధపడదు అని చెప్పాను.

తరువాత వారు ఇంగ్లీషు మూల గ్రంథములో నుంచి ఆ భాగాన్ని చదివారు. "దీనిని మీరు మాత్రం ఎలాగ తెలుగు చేస్తారు?" అని నన్ను అడిగారు, మీరు మాత్రం తెలుగు చెయ్యలేరా?" అని నేనన్నాను.

"ఎలాగ" అన్నారు వారు. అందుకు నేను, "అయ్యా! మీరు తెలుగు పండితులు కదా. ఎంత కష్టమైన తెలుగు గ్రంథాలనయినా విద్యార్థులకు బోధపర్చడము మీపని కదా! ఇప్పుడు మీరు చదివి వినిపించిన భాగమే మీకు బోధపర్చవలసివస్తే ఏం చేస్తారు? మాటలలోను అన్వయంలోను ఉన్న కష్టాన్ని తీసివేసి తేలికమాటలతో దీని భావాన్ని అలతటిని తెలిపేటట్లు చెప్పుతారా లేదా? భావంలో ఒక పివంతయినా జారకుండా చూస్తారా, లేదా? అలాగే టెక్స్టుబుక్కు అనుకొని ఆ భాగంలో ఉన్న భావాన్ని తేట మాటలతో వ్రాయండి. అప్పుడు మీరు తెలుగుచేసిన వాళ్ళవుతారు ఇప్పుడున్నట్టుగా వ్రాస్తే ఏమంచతంత్రమో అంటాను గాని తెలుగనను' అన్నాను.

అలాగ రాస్తే గ్రంథం బలిసిపోతుందని భయపడ్డారు. బోధపడకుండా ఉం చిన్న గ్రంథంకన్న బోధపడే పెద్ద గ్రంథం మేలుకదా అన్నాను. తుదకు వారే చేశారో నాకు తెలియదు.

మరొక ఉదాహరణ:

సామ్యవాదమును గురించి గాని, ఆర్థిక విషయాల గురించి గాని సూత్రరూపం చెప్పడమూ, వ్రాయడమూ రెండూ చాలా కష్టమైన పనులే. ఇప్పటికీ ఆయా యాలలో మహాకృషి చేసిన ఉపాధ్యాయులు కాలేజీలలో ఒక్కొక్క సంగతి ఏ పర్చడానికి గిజగిజ గింజుకోవడం చూస్తూనే ఉన్నాము. అటువంటి సంగతు మిక్కిలి తేటమాటలతో అందరికీ బోధపడేట్టు చెప్పాడు బెర్నార్డుషా.

మహాక్లిష్టమైన వేదాంత సూత్రాలనీ, పాషాణాలని కూడా తోవంటబోతూవున్న పాఠానికి బోధపడేటట్లు చెప్పవచ్చునని సవాల్ చేయవచ్చును. దీనికి ముఖ్యమైన దేమిటంటే, చెప్పేవాడికి అసలు సంగతి చాలా బాగా తెలియాలి. అది ఎరువుసొమ్ము కాకుండా తనహక్కు అయిపోయి ఉండాలి. ఎరువుగా ఉన్నంతకాలము బిరబిరలు తప్పవు. మాటల ఆడంబరం పోదు.

మాటల ఆడంబరం మహాకవుల గుణం కాదని ఇప్పటికి రుజువు అయిందనే భావించవచ్చును గదా! ప్రజలకు తెలిసిన మాటలతో చెప్పడమే గొప్ప సంగతి. ఎక్కడో భావాన్ని బట్టిగాని, అందుకు తగినమాట సామాన్యమైనది లేకపోవుటచేత గాని జనులకు తెలియని మాట వాడుక చేయవచ్చును. అప్పుడు సంతోషంతో నిఘంటువు చూస్తారు. అంతేగాని ఎండుపుడక పట్టుకున్నాడు అనడానికి శుష్క కాండంబు హస్తంబున ధరించి అనడమెందుకు కలం శోష, కంఠశోషగాని!

ప్రజలకు చాలా మందికి తెలిసేదే భాషగాని ఏ పదిమంది పండితులకో మాత్రం తెలిసేవి కాదని దీనివల్ల రూఢి అవుతూవుంది. కాబట్టి భాష అందరికీ తెలిసేటట్లు ఉండాలి అన్నదే ఒక సూత్రం మొదటిదారపోగు.

## ఈ సూత్రంవల్ల ఫలితం

ఈ ఒక్క సూత్రం మనమందరం ఒప్పుకోవాలి. ఎవరైనా ఏభాష వారైనా ఒప్పుకోక తప్పదు. ఈ ఒక్క సూత్రం ఒప్పుకోగానే దీనివల్ల కలిగే ఫలితం ఏమిటోచూడండి

## మాటలు

వాడుకలో వున్నటువంటి మాటలు తప్ప తక్కిన మారుమూల మాటలు, తెలుగైనా, సంస్కృతమైనా మరేభాష అయిన ఉపయోగించడానికి వీలుండదు, అందరికి బోధపడడమే ప్రధానంగా పెట్టుకొని వ్రాసేవాడు సాధారణంగా జనసామాన్యానికి తెలిసేమాటలే వాడుక చేయాలి. ఆమాటలు సంస్కృతంకావచ్చు, ఇంగ్లీషు కావచ్చు హిందూస్థానీ కావచ్చు ఆయా భాషలలో నుండి కొన్నిమాటలు తెలుగులోనికి దిగిపోయాయి. వాటిని వెనక్కి మరలించడం సాధ్యంకాదు. ఆ మాటలు వాడితేనే అందరికీ సులభంగా బోధపడుతుంది. ఆ మాటలు మాని తెలుగునో, సంస్కృతాన్నో, కొత్తమాటలు అల్లుదామంటే ఏమి బోధపడదు.

ఇతర భాషలనుంచి మాటలు అవసరాలను బట్టి చేర్చుకోవడం ప్రతి భాషకి అవశ్యకం. దానిలో చిన్నతనం ఏమీలేదు. ప్రపంచం రోజుకు రోజుకు అభివృద్ధి పొందుతున్నాది. కొత్త వస్తువులు, కొత్త అభిప్రాయాలు పుట్టుతున్నాయి. వాటికి కొత్త మాటలు ఉంటాయి. ఆ మాటలని అన్ని భాషల వాళ్ళు ఆదరిస్తారు. దీనిలో సిగ్గుపడవలసిన దేమీలేదు. కాని వ్రాతగాడు మాత్రం జనసామాన్యానికి బోధపడడం అనే ముఖ్య సూత్రాన్ని తనయెదుట పెట్టుకోవాలి.

తెలుగులోనే ఆయా జిల్లాలలో మాటలకీ కొంత వ్యత్యాసముంటుంది. వాటినే మాండలిక పదాలంటారు. అలాంటివి వాడుక చేసినప్పుడు వ్రాతగాడు కొంచెం జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే ఏదో ఒక జిల్లావాళ్ళకి మాత్రం బోధపడి తక్కిన జిల్లాల వాళ్ళకి బోధపడకుండా పోవచ్చును. కొంచెం శ్రద్ధతీసుకుంటే ఈ చిక్కు తప్పుతుంది. ముఖ్యసూత్రాన్ని మరిచిపోకుండా ఉంటే, ఆ జాగ్రత్త లేకపోతే వ్రాతగాడి శ్రమ అంతా నిష్ఫలమయి పోతుంది. కాబోలు, కావాల, కామోలు, కామోసు, కాంబోసు అని అనేక రూపాలు వాడుకలో ఉన్నప్పుడు ఏది వాడితే ఎక్కువ మందికి తెలుస్తుందో చూచుకోవాలి.

ఒక అర్థాన్ని తెలియజేయడానికి రెండు మూడు మాటలు వాడుకలో ఉండవచ్చును. అలాంటప్పుడు గూడ వ్రాతగాడు కొంచెం శ్రద్ధతీసికొని వాటిలో ఎక్కువ సులభంగా బోధపడే మాటనే వాడుక చేయాలి. చెట్టు అంటే తెలిసేచోట వృక్షం అనడం అర్థంలేని శ్రమకాదా? కొన్ని మాటల రూపాలు గూడా మారిపోయినాం మొదటి రూపాలు వాడుకాలేదు. చాలామంది వ్రాతగాళ్ళలో ప్రయోగమూ లే అలాంటప్పుడు వాడుకలోని రూపం వాడడం మంచిది.

## సమాసాలు

సాధారణంగా బోధపడే సంస్కృతం మాత్రం నిలుస్తుంది. తక్కిన సంస్కృతానికి కొంత అగచాట్లుతప్పవు. అవసరాన్ని బట్టి ఎక్కడయినా కొత్త సంస్కృతం మాట రావచ్చును కాని సంస్కృత సమాసాలకి అవకాశం లేదు. వాడుకలోనికి వచ్చి ఉన్న సంస్కృత సమాసాలు నిలువవచ్చును. ఇవి చాల తక్కువ. ఎంత సాగదీసినప్పటికి రెండు మాటలకన్న ఎక్కువ ఉన్న సంస్కృత సమాసాలకి సాధారణంగా జాగాలేదు. అలా వ్రాసిన సమాసాలు చాలావరకు బోధపడని వాటి కింద లెక్క వేయవలసిందే.

పెద్దసమాసంలోని మాటలు తెలిసినవే అయినప్పటికి సమాసంలాగ వ్రాయడం చేత బోధపడడం కష్టమైపోతుంది. విరుపులెక్కడో తెలియదు. వాడుకకు దూరమై పోతుంది. జనసామాన్యం ఊహ అంతవరకు ఆనదు. అర్థంచేసుకోవడం కష్టం అయిపోతుంది. ఒక్కొక్కవేళ అర్థమేకాకపోవచ్చును. అప్పుడు కవి శ్రమ విఫలమవుతుంది. కాబట్టి పెద్ద సంస్కృత సమాసానికి అవకాశం ఉండదు.

అలాగుననే తెలుగు సమాసం గూడ క్లిష్టం కాకుండా ఉన్నంత వరకే ఉప యోగించవలసి వస్తుంది. దీనితో సమాసాల సూత్రాలు చాలావరకు ఎగిరిపోతాయి.

## సంధి

చక్కగ బోధపడాలని వ్రాసేవాళ్ళు సాధారణంగా కష్టమైన సంధులు లేకుండానే వ్రాయడానికి చూస్తారు. మిక్కిలి ఆవశ్యకమైన ఉకారసంధి వంటి సంధులు, (కూడదన్నా) కొన్ని త్వార్థకేకారం సంధులు మాత్రం నిలుస్తాయి. తక్కిన టుగా గమాలు. నుగాగమాలు. ముగాగమాలు మొదలైనవన్నీ చాలవరకు అంతరించిపోతా యన్నమాట, ఇంక ఇలాగ ఆలోచించి చూస్తే సంధి ప్రకరణంలో ఏ పది సూత్రాలో నిలుస్తాయి. తక్కినవన్నీ ఉపయోగానికి రాకుండా ఉండిపోతాయి. ద్రుతాలతో చేసిన సర్కసు అంతా అణిగిపోతుంది. సరళాదేశాలు ఏజంట పదాలతోనో తప్ప తక్కిన చోటులలో కనపడకుండా పోతుంది.

## పడు, యొక్క

వినబడు, కనబడు మొదలైన కొన్నింట తప్ప తక్కినచోట్ల పడు ప్రయోగం పడి పోతుంది. సంహరింపబడెను అనడానికి అవకాశం ఉంటదు.

"యొక్క" అడావుడి కొంత ఊడుతుంది. రాముని యొక్క పుస్తకం అనడానికి బదులు రాముడి(ని) పుస్తకం అంటారు. ఈపడు, ఈయొక్క సంస్కృతం వాళ్లు తెచ్చిపెట్టిన బెడద మన తెలుగులోనికి ఋషిప్రోక్తం అనగా ఋషులచేత చెప్ప బడినది అని అర్థం చెప్పారు గాని ఋషులు చెప్పినది అని అర్థం ఒక్కనాటికి వాళ్ల చెప్పేవారు కారు. రామస్యగృహం అంటే రాముని యొక్క ఇల్లు అనాలిగాని రాముడి(ని) ఇల్లు అని అంటే చాలేదికాదు. షష్ఠీ విభక్తి యొక్క కనబడాలి అర్థంలో, ఆ అలవాటు అర్థం చెప్పేటప్పటితో ఆగక అంతటికీ ఎక్కింది. అసలు వ్రాతలకు

కూడా ఎగబాకింది. బాగా ఒంటబట్టి పోయింది, కొత్త కొత్త అభిప్రాయాలతో వ్రాస్తూ ఉన్న వాళ్ళుకూడా ఈపడులు, ఈయొక్కలు తప్పించుకోలేకుండా పోతున్నారు. ఎక్కువగా వచనంలో క్షౌర దుకాణం దగ్గర "ఇచ్చట క్రాపులు కత్తిరించబడును" అనే ఉంటున్నది కదా!

## క్రియల రూపాలు

వాడుకలో క్రియల రూపాలు చూస్తే వీటిలో చాలామట్టుకు వ్యాకరణాలకు భిన్నంగానే ఉంటాయి. వాడుకలో విశేషంగా ఉన్న ఉంది, చేశాడు, వస్తాము, పోతున్నారు. ఇటువంటివి నిలుస్తాయి వచ్చితిరి, ఉండెడివి మొదలైనవి పోతాయి. లిట్, లాట్‌లను గురించి కొట్టుకున్న బాల వ్యాకరణము సూత్రాలన్నీ చాలావరకు పనికిరాకుండా పోతాయి.

## "బండిరాలు, అరసున్నాలు"

బండి రాలకి, అరసున్నలకి అవసరం ఉండదు. అన్నిరాలు ఒక్కలాగానే వ్రాస్తాము. పలుకుతారు. అర్థంలో ఏమైనా భేదంవుంటే ఆ మాటకి రెండర్థాలున్నాయి అని అనుకుంటారు

ఆలాగే అరసున్నలు పోయి అవసరం ఉన్నచోట్ల రెండర్థాలు ఉన్నాయనకుంటారు. అందరికీ చక్కగా బోధపడాలన్న ఉద్దేశాలతో వ్రాస్తూ వుంటారు కాబట్టి ఈ అర్థమా, ఆ అర్థమా అన్న చిక్కులో ఎప్పుడూ మనం పడం. సందర్భాన్ని అర్థం తెలుస్తూనే ఉంటుంది కరము అంటే చెయ్యి అనడమా, కిరణమనడమా యోచిస్తయినా గింజుకున్నామా? కనడం అంటే బిడ్డను కనడమా, చూడడమా ఇ ఏ వ్రాతలోనైనా సందేహం కలుగుతుందా! అలాగే ఈ మాటలకి గూడా బాధలేదు

## "ఇప్పటి వ్యాకరణం పోట్లు"

ఇలాగు మనం పక్షపాతం లేకుండా అన్నీ ఆలోచించి చూస్తే ఇప్పుడు మ వ్యాకరణం అని వాడుకచేస్తూ ఉన్న సూత్రాల కట్టకి చాలా దెబ్బతగులుతుంది. పక్షపాతం లేకుండా ఉన్న ఎవరైనాసరే వ్యాకరణాన్ని (చిన్నయసూరి గారిది) పట్టుకొని పైని చెప్పిన మాటల ప్రకారం చూడండి. పనికిరాదన్న సూత్రాన్ని పుస్తకంలో ఎర్ర

పీటతో కొట్టివేయండి. వాడుకలోలేని రూపాన్ని ఇచ్చే సూత్రం కొట్టివలసిందే. వాడుకలో ఉన్న రూపాన్ని కాదన్నసూత్రం కొట్టవలసిందే. అలా కొట్టివేసుకొని వచ్చేసరికి పుస్తకమంతా ఎర్రసిరా గీతలతో నిండిపోతుంది. ఇది నిజం ఏవోకొన్ని సూత్రాలు మాత్రం నిలుస్తాయి. కాని ఇవి చాల తక్కువ. మహాతక్కువ. పోయిన సూత్రాలు వందలకొద్దీ వుంటాయి. నిలిచిన ఆ నాలుగు సూత్రాలకోసం ఆ వ్యాకరణం మన తెలుగు భాషదనటం న్యాయం కాదు. ఆ వ్యాకరణం ఇంతకుముందు వ్రాసిన గొప్ప వ్రాసిన తెలుగు భాషది కావచ్చును. కాని ఇప్పటి భాషదికాదు. గతించిన తెలుగుది ఆ వ్యాకరణం. ఇప్పటి తెలుగుకి ఆ వ్యాకరణం పనికిరాదు. నూటికి తొంభై సూత్రాలు వాడుకకి పనికిరాకుండా ఉన్న వ్యాకరణం జీవంతో ఉన్న వ్యాకరణం కాలేదు.

జీవంతో ఉన్న వ్యాకరణం కావాలంటే మరొక తొంభై కొత్త సూత్రాలు తయారు చెయ్యవలసి వస్తుంది. అలాగ తయారైతే అప్పుడు సజీవమైన వ్యాకరణం తెలుగుకి కలుగుతుంది అంతేగాని ఇప్పటి వ్యాకరణాన్ని సజీవమైనదని చెప్పడానికి వీలులేదు. దానితో ఈ తెలుగుకు పనిలేదు. అది చచ్చినదనే చెప్పవచ్చును

కాని పూర్వ గ్రంథాలను చదివినప్పుడు ఆ గ్రంథాలలో ఉన్న రూపాలను గురించి తెలుసుకోవాలంటే ఈ వ్యాకరణాలు పనికివస్తాయి. అవి ఉంటేనేగాని ఆ గ్రంథాలు బోధపడవు. ఇంగ్లీషు షేక్స్పియర్‌లో (1600 సం.) వ్రాసిన భాష కోసం ఒక వ్యాకరణం ఉంది- ఇప్పటి ఇంగ్లీషు వ్యాకరణంతో ఆ మహాకవి వ్రాసిన దానిని చదవాలంటే కొంత చిక్కు ఉంటుంది. కాని ఆ ప్రత్యేక వ్యాకరణం పట్టుకొని అతని వాక్యాలు చదివితే చక్కగా బోధపడతాయి. అలాగే సజీవమైన అందరికీ బోధపడుతూ వాడుకలో ఉన్న తెలుగుకి ఇప్పటి వ్యాకరణాలు చచ్చినవాటితో సమానమే. అయినప్పటికి, పాతగ్రంథాలను చదివేవాళ్ళకి అది చాలా సహాయం చేస్తుంది.

"ఆ వ్యాకరణం ఎందుకు కావాలి?"

ఆ వ్యాకరణాలు నిర్జీవమై చచ్చినవాటితో సమానమే అని వ్రాయడం నాకు, ఆ మాటలు చదవడం మీకు రెండూ చాలా విచారకరమైన సంగతులే. కాని ఆ మాటలు నిజం. ఇంత ఘోరం ఎందుకు కల్గింది అని ప్రశ్నించి చూస్తే, మన వాళ్ళలో ఒక పెద్దలోపం కనబడుతుంది. ప్రవాహం లాగ వాడుక- అందులోను పెద్దవాళ్ళలో ఉన్నవాడుక- ఒక పక్కనుండి కోస్తాలు, కోస్తాలు కొట్టుకుపోతూవున్నా,

"అబ్బే. ఇదేపాటి ? చాల చిన్నది అదే తగ్గిపోతుంది" అనే అన్నారుగాని జాగ్రత్త పడలేదు. కాబట్టే అంతా కొట్టుకపోవలసి వచ్చింది. వాడుకలో వేరుతన్ని పండితుడి నోటికెక్కి కావ్యాలలోనికి పాకిన రూపాలని గూడా ఆ వైయాకరణులు అలక్ష్యం చేశారు వందలకొద్దీ కవులు ప్రయోగిస్తూవున్నా కవిత్రియం వాళ్ళు వాడుకచేయ లేదు కాబట్టి ఆ ప్రయోగం తప్పు అనే అన్నారు. అంతేకాని పాతసూత్రం సవ రించడం మంచిదని అనుకోలేదు.

భట్టీయాలలో సూత్రాలని ఇనుప కొరుత్రిల్లాగ పట్టుకున్నారు. వంచడానికి, పెంచడానికి వీలుమాత్రం ఇచ్చారు కాదు. ఆఖరికి ఇనుప కొర్రులు తుప్పుపట్టి చూర్ణం అయిపోయాయి. అలాగ కాకుండా, సందర్భాలనుబట్టి చాలా అవసరం అని అనిపించి నప్పుడల్లా ఆ సూత్రాలని కొంచెం సడలించివుంటే, ఈనాటికి ఇంత ఆపద రానే రాదు. అప్పటికప్పుడు సవరిస్తూ వచ్చిన వ్యాకరణం ఈనాటి వాడుకనుబట్టి ఏ నాలుగు సూత్రాలో సవరించుకొని వుందును అప్పుడా వ్యాకరణాన్ని నిర్జీవమైందని కాని, చచ్చినదానితో సమానమైందని కాని అనవలసిన కష్టం మనకు తప్పివుండేది.

కాని ఏమి చేయగలం ? వాళ్ళకాబుద్ధి అప్పుడు పుట్టలేదు. ఇప్పుడిది తప్పింది కాదు. తుదకు మన మొదటి దారపోగు సూరి వ్యాకరణానికి ఉరితాడయింది.

ప్రస్తుతమగుటచే నిట మన తెనుఁగు నాఁటి మాట తీసికొనుచున్నాను. ఇతరులచేఁ బ్రాజ్ఞులని సత్కరింప బడినవారు, ఇతరులను దమ నిర్ణయము చొప్పున వినిపింప గల్గినవారు ఎవరో కొంద ఱాయాకాలములయందేవో కొన్ని ఛందో వ్యాకరణాది విధుల నేర్పరచి యావిధుల చొప్పున గ్రంధరచనాదికము జరుగవలెనని నిబంధములు గల్పించుచు వచ్చిరి. అధమగతి నున్న తక్కినలోకము వారి నిర్ణయములను గొన్ని ప్రయోజనములందుఁ గొంతకొంత పాటించుచు వారిని వెంటాడుచు వచ్చిరి. దేశకాల పాత్రములను బట్టి యా నిర్ణయములును మాఱుచు వచ్చినవి, మఱియు నిట్లింతకాలము వరకు నా భాషాలక్షణ నియామకులు తమకుఁ బరిచిత మయిన జన సంఘమును బ్రయోజనములను మాత్రమే లక్ష్యముగాఁ జూచుకొని నిబంధములఁ జేయుచు వచ్చిరి కాని యా భాష ప్రచారము గాంచిన సర్వమానవ సంఘమును గూర్చియు భాషవలన వారివారికిఁ గలుగ వలసిన సర్వ ప్రయోజనములను గూర్చియు జర్చించి సర్వార్థసాధక మగునట్లు నిబంధముల నేర్పరచిన వారుకారు. కావ్యాలంకారచూడామణికారునినుండి బాలవ్యాకరణకారుని దాకాఁ గల పండితులు చేసిన నిబంధము లాంధ్రదేశమందలి పరిమిత మానవసంఘమునకు మాత్రమే కొంత చాలి యున్నవి. ఇంతదాక గడచినకాలము తీరు వేఱు నేటికాలము తీరు వేఱు పూర్వము వారు తలఁచియైన నెఱుగని యావశ్యకత లెన్నో యీనాఁటి వారికిఁ గల్గుచున్నవి.

పూర్వము వారు మానవులుగాఁ గూడ గణింపని వారెందరో యిప్పుడు మహనీయులగుచున్నారు, ఇట్టి స్థితిలోఁ బ్రాచీనుల నిబంధము లీకాలమున బనికిఁ జాలనివి పనికి మాలినవి యగుచున్నవి. భాషావిషయముననే కాక సర్వవిషయములందు నిట్టి సంఘర్షమే సంఘటిల్లినది. నేఁడొక యద్భుతశక్తి యఖిలప్రపంచము నావహించినది. భారతదేశము నది బలముగా నలముకొన్నది. ప్రతిమానవుడు "నేను బరతంత్రుడనుగానుండరాదు స్వతంత్రుడనుగావలెను. అనునాత్మాభిమానము ఖాడముచున్నది. ఒకని నిబంధమున కింకొకడు లోనవకున్నాడు. బ్రాహ్మణుని యాధిక్యమును ప్రతిఘటించుటకు మాలవాడును మహారాజు పార్థివమును ప్రతిఘటించుటకు దరిద్రుడును బ్రయత్నించుచున్నారు. ఈ సంఘర్షణ మనివార్యముగా నున్నది, నివారించుటకు కూడఁ గూటిని పనిగాఁ దలపడుచున్నది. దీక్షివశ్యులు కొందఱు పెద్దలిందుకై చండాలాదుల యస్పృశ్యతాదులను తొలగింపవలెననియు, దరిద్రులు సంపన్నులగుటకు వలయు సాధనముల సమకూర్పవలెననియు సంస్కారముల సేయ సమకట్టుచున్నారు. భాషా విషయమునఁ గూడ నట్టిదే జరుగుచున్నది. కొందఱు పండితులు, కొన్ని భాషా ప్రయోజనములనే యుద్దేశించి చేసిన నిబంధములు నిలువ

గింపరానివనియు, భాషవలన నంతకంటె హెచ్చు ప్రయోజనము లిప్పుడు పడయ వలసిన యావశ్యకత యేర్పడుచున్నదనియు, సర్వమానవ సంఘమును భాషా ప్రయోజన సర్వస్వమును సమముగా బడయవలసియున్నదనియు, నందులకై వాడుక భాషను గ్రంథరచనము జరుగవలెననియు వాదించుచున్నారు. అట్లు గ్రంథరచన ముల జేయుచున్నారు. నేనును నట్టి సంస్కారము నభిమానించిన వారిలో నొక్క డను. కాని దానిగూర్చి యిటీవల నాయభిప్రాయము మఱింత విపులముగా విరిసి చిక్కు దోచనిదిగా నున్నది.

ఇదివఱకు మేము కొందరము సంకల్పించిన సంస్కారములు సంకుచిత భావముల గలవిగానే యిప్పుడు తలచుచున్నాను. ఏలనగా; "వచ్చుచున్నాను" అను శబ్ద రూపమువలెనే "వస్తున్నాను" అనురూపము కూడ ప్రాజ్ఞవ్యవహారమందు గలదు గనుక ప్రయోగార్హమని యంగీకరింపదగునంటిమి. కాని ప్రస్తుతకాల పరిణామమును జూడగా ప్రాజ్ఞ సంఘమిదియని వేఱుపఱుచుట కిక వీలుకలుగ నట్లున్నది. సర్వమానవ సంఘమందును విద్యా విజ్ఞానములు విపులముగా వెలయుచున్నవి. అహమిక నింపారుచున్నది. బ్రాహ్మణాదుల వ్యవహారమందుగల 'వస్తున్నాడు' ప్రయోగార్హమయినప్పుడు పంచాలాదుల 'వస్తుండాడు' మొదలగు రూపములు ప్రయోగార్హము లేలకావు? బ్రాహ్మణుల యాధిక్యమును జండాలురు వెన్నాడకున్నప్పుడు వారి భాషా ప్రయోగరీతిని మాత్రమేల వెంటాడుదురు?

'మా సంఘ వ్యవహారమున నున్న రూపమునే మేము మా గ్రంథములందు ప్రయోగించుకొందు' మందురేని "వస్తున్నారు" మాత్రమే ప్రయోగార్హమని తలచు వారేమి బదులు చెప్పగల్గుదురు? ఇట్టి రూపములే ప్రయోగార్హములని విధించుటకు వీరికేమి యధికారమున్నది? నాకు నేనయి యింతవఱకు మాత్రమే సంస్కార మంగీకరింపదగునని నిబంధింప బూనితినేని యా నిబంధమునకు లోగువారెవ్వరు? ఇట్టిచిక్కు భాషా విషయముననే సర్వవిషయము లందును గూడ సంఘటిల్లినది. సాంఘిక రాజకీయ విషయములందు గొన్ని సంస్కారములు మహాత్ములకు గూడ గొం-బడనివిగా నున్నవి. ఈ చిక్కుయొక్క పరమావధి యేమనగా— ఒక్కొక్క మనుష్యుడును 'నా భాషను నేను వ్రాయుదును. ఇంకొకరి నిబంధము నాకు విధాయకముగాదు' అన్నంత వరకు బోవచ్చును. కాని యట్టి సంఘర్షమున జిదికిపోయెడి చింతనములేవో బ్రతుకగల్గెడి భావములేవో వీని పరిణామ మెట్టిదగునో నాయల్ప

బుద్ధికి గోచరము కాకున్నది. నేఁడు భాషా సంస్కారము నపేక్షించి చర్చించు వారిలోఁ గూడ నైకకంఠ్యము లేదు. "చూచినాడు, చూచాడు, చూసినాడు, చూశినాడు, చూశాడు, చూసేడు" అని యిన్ని రూపములను వ్రాయుచున్నారు.

ఇందు గొన్నియే పరిగ్రాహ్యములని వ్యవస్థాపించి యాచిపట్టుట కధికారులు లేరు. సంస్కారమే పనికిరాదని యడ్డుపెట్టుట కంతకంటె నధికారులులేరు. ఆ సంస్కారమనివార్యముగా జరుగుచునే యున్నది. అయ్యో! ఎంత భయంకరమైన చిక్కు? ఇట్టి చిక్కు ఒక భాషా విషయమందేగాక సర్వ విషయములయందు సంప్రాప్తమయినదిగదా! మానవ మాత్రుఁడు ప్రాభవముచేగాని, పజ్ఞచేగాని యను శాశింప జాలఁడేమోయని నా సంశయము. భగవంతుడొకడుండెనేని లోకమును బరమానందోద్దేశమునకుఁజేర్చుటే తదుద్దేశమేని, యాయన కల్యాణ మార్గమేదో లోకమునకు గల్పింపగలఁడు. అది యేదో యందువఱకును మన ప్రయత్నములు గ్రుడ్డియెద్దు చేనఁబడినలాగున సాగుచుండవలసినవే కాబోలును. అట్టి శుభసమయము లోకమునకు లభించుటెప్పుడో!

# 10. ఓ పువ్వు పూసింది

—గుడిపాటి వెంకటచలం

అర్థరాత్రి అడవిలో పువ్వు పూసింది. చుట్టూ చీకటిని చూసి, భయమేసి, 'అమ్మా' అని ఏడ్చింది. ఆకులూ తొడిమలూ దగ్గరగా తీసుకుని భయంలేదని వూయించాయి ఆ తెల్లని పసి పువ్వుని.

'ఏదీ?' అంది పువ్వు.

'ఎవరు?' అంది తల్లితీగ చీకట్లోంచి.

'నన్ను నీదగ్గరికి తీసుకవచ్చారూ, అతను?'

'ఎవరు తీసుకొచ్చారు? నేనే తెచ్చుకున్నాను నిన్ను; నా గారాబాన్ని, నా బంగారాన్ని, నా ముద్దుల మురిపాన్ని నిన్ను.'

'నువ్వేనా? ఎవరో అనుకున్నాను. నువ్వేనా నా చేతిని పట్టుకుని నక్షత్రాల మధ్యనించి ఆడుతో, నవ్వులో, అట్లా తెలివొచ్చి నన్నిక్కడ దించింది? ఓసారి కనపడు.'

'తెల్లారనీ. నన్ను చూద్దుగాని. ఇప్పుడు పడుకో'

'భయమేస్తోంది కిందికి పడిపోతానా?'

'నేను పట్టుకున్నాను కాదూ!'

'ఆకలేస్తోంది అమ్మా!'

'పువ్వు నోట్లోకి వెచ్చగా, తియ్యగా, వొంటినంతా సంతోషంతో నింపుతో పాలు వొచ్చాయి.'

'వొచ్చావా?' అని వొళ్ళో పెట్టుకుని వూపింది గాలి.'

'అమ్మా! ఏమిటి ఆటా పాకుతోంది నా వెనక?'

'ఏం లేదు, అది పాము. తిండికోసం తిరుగుతోంది.'

'నన్ను తింటుందా?'

'నిన్నెందుకు తింటుంది? చాలా మంచిది. పిట్ట పిల్లల్ని తింటుంది. మన జోలికి రాదు.'

పెద్దపెద్ద చెట్ల వెనకనించి అర్ధ చంద్రోదయ మౌతోంది. కళ్ళు పెద్దవిగా విప్పింది పువ్వు. చెట్ల కొనలు మెరుస్తున్నాయి. నేలమీద సందుల్లోంచి చారలుగా వెన్నెల పాకుతోంది. చీకటిని పక్కలకు తోసుకుంటో. చుట్టూ అడివిని చూసి— 'చూడు అమ్మా చూడు' అంటో చప్పట్లుకొట్టి ఆడింది పువ్వు.

'నిదర్రికళ్ళతో పాడుతోంది తల్లి.

తలెత్తి తల్లివంక చూసింది.

'ఎంత అందంగా వున్నావు అమ్మా!'

తన కళ్ళకి అందక తల్లిని తీగెలు చీకట్లలోకి పెనవేసుకున్నాయి పరిమళాలలో విరజోసుకుని వల్లని నీడల్లో వూగుతున్నాయి ఆకు గుబుర్లు.

'ఎవరిమీద నమ్మా, కావిలించుకుని అల్లుకున్నావు? అతనెవరు, గంభీరంగా అట్లా నుంచున్నాడు నీబరువు మోస్తో?'

'మీనాన్న'

'అమ్మా, అమ్మా, అమ్మా! ఎవరు అట్లా కిరకిరమంటారు?'

'అమ్మా, పట్టుకో నన్ను.'

'అవి కోతులు. మీ నాన్నకోసం వొస్తాయి.'

'నిన్నేం చెయ్యవు అవి '

'మరి నాన్న వాటిని—'

తనపేరు పిలుస్తున్నాడు. పాడుతో వెన్నెలలో తేలి తనచుట్టూ మూగుతున్నారు పుష్ప కిన్నెరలు. తనెరుగును వాళ్ళని.

'పుట్టావా? నువ్వు ఇక్కడ పుట్టావా?'

—చుట్టూ మూగి, పువ్వుని కదుపుతున్నారు. రేకుల్లో చిన్నచిన్న నొక్కులు అందంగా దిద్దారు. మంచు ముత్యాలహారాలు వేశారు. వాళ్ళ వెనక తనకి కనపడకుండా నీడలో ఎవరు నుంచున్నారు? తనకి తెలుసు ఎవరో! ఎప్పుడెప్పుడోనించి. అనంత కాలంనించి, అనేక రూపాలలో, అనేక లోకాలలో, అనేక ఆనందాలలో తనతో చెయ్యికలిపి ఎన్నడూ వినని వొదలని ఆనీడ ఎవరు? తన తలపైనించి, చీకట్లలోనించి తియ్యని పిలుపు దూరంగా దేనికోసమో ఆశపు. ఆకులన్నీ నిలిచి వింటున్నాయి. గాలి చిన్న తరంగాలతో పులకరించింది.

ఎవరు? ఎవరు? ఎంత వెతికినా కనిపించని ఎవరు?
'అమ్మా. అమ్మా' ఎవరు?'
'కోవెల'
'ఎవర్ని పిలుస్తుంది?'
'ప్రియుణ్ణి'
'రాడేం'
'చీకటి'
'మళ్ళీ పిలవమను'
'పిలుస్తుంది'
'ఎంత అందమమ్మా ఈ లోకం?'
'నే నెక్కడ వున్నాను ఇక్కడికి రాక?'

పువ్వుకి ఎదురుగా. పెద్దకాంతి పుష్పం అంధకారపు తూర్పు శాఖన వికసించి జ్వలిస్తోంది. తేలికగా తనని కప్పి నవ్వించే మబ్బు తెరలోంచి తన వెలుగు చేతుల్ని జాస్తోంది పువ్వువేపు ఉత్సవాలు, వాయిద్యాలు, అరుపులు, సంతోషాలు.

పూడుస్తున్నారు? తోరణాలు కడుతున్నారు? జయజయధ్వానాలు చేస్తున్నారు, ప్రతి మబ్బుకి రంగుల్ని అలంకరిస్తున్నారు. అత్రుతగా సంతోషాన్ని ఆపుకోలేక ఇటూ అటూ పరుగెత్తుతున్నారు. అవీకుమారులు దుమ్ముదులుపుతూ, అందర్నీ మేలుకోమంటూ, ఎండిన ఆకుల్ని దూరంగా తోసేస్తో చెట్లు గాలిలోకి నోళ్ళు తెరుచుకొని ఆరగిస్తున్నాయి ప్రథమ భోజనాన్ని.

కాంతి కాంతి ప్రపంచమంతా కాంతి ఆకాశాన్నంతా ఆనందంతో నింపుతో, కాంతి, అలలమల్లే కాంతి విరుచుకు పడుతోంది లోకంమీద.

లోకం రూపమే మారింది. సగం చందమామ నవ్వుతో నమస్కరించి ఆకాశం లోపల కరిగి పోయినాడు. లోకాధిపతి వలె వెలిగిన వేగుచుక్క భయంతో ఏ మూలకో వొదిగాడు. మబ్బులు సిగ్గుతో రంగుల్ని కడిగేసుకుని తెల్లని వొళ్ళతో పక్కపక్కల ముడుచుకున్నాయి. దేదీప్యమానమైన కాంతితో ఎర్రగా, ఎక్కడా కల్మషాన్నీ, అంధకారాన్నీ, అల్పత్వాన్నీ సహించని, క్షమించని దివ్యనిర్మల తేజస్సులు చిమ్ముకుంటో బయల్దేరాడు మార్తాండుడు.

పక్షులన్నీ రెక్కలు చాచి ఎగురుతున్నాయి. మృగాలు వొళ్ళు విరుచుకుని కదులుతున్నాయి. పవనకుమారులు చెట్ల ఆకుల చివర్లలో కూచుని భయంగా చూస్తున్నారు.

సమస్తమూ మరిచి కళ్ళు తెరుచుకుని చూస్తున్న పువ్వు వైపుకి తీక్షణంగా ఒక్క కిరణాన్ని విసిరాడు సూర్యుడు.

'చచ్చాను' అని కళ్ళు మూసుకుంది కన్య. వొళ్ళంతా వొణికింది. దెబ్బ తిన్నట్టు సొమ్మసిల్లింది. తానంతా ఎర్రగా ఐపోయింది.

ఒక్కసారి తన మొదట్లోంచి, నేలలోంచి పీల్చుకుని తనలోకి దిమ్మరించే అమృతంతో తానంతా నిండిపోయింది.

'అమ్మా' అని వొక్క అరుపు అరిచింది. భయం కాదు, సంతోషం కాదు బాధకాదు, పులకకాదు, నవయవ్వనం.

తనలోకి ఆ లేత ఎండ, వెన్నెల, కిందిగడ్డి నవనవ. ఆకాశంలోని నీలపు నునుపు. తన తండ్రి కొమ్మల బలం, కోవెల కంఠంలోని జాలి, గాలిలోని అర్థం లేని అల్లరి, తనతల్లి వేళ్లకింది భూమిలోని అనర్గళ సారం— అన్నీ ప్రవహించాయి.

తన రేకుల్లో తళతళలు, తన యీనెల్లో నున్నటి వుబుకు, తన బొడిపెల్లో పగలడానికి సిద్ధమైన మదపు సౌరభం తనతొడిమలో విశాలమౌతున్న బలం. తన సమస్తంలో ఆగని, అంతులేని కారణం లేని, కాంతి.

అకస్మాత్తుగా తనని ముంచుతో చీలుస్తూ పైనపొర్లి సముద్రం అలలమల్లే, మూర్ఛలు తెప్పించే పరిమళం. తనని, తల్లిని, గాలిని, ఆకాశాన్ని నింపి పొర్లే అలలుగా జ్వాలలుగా తనలోనించి పరిమళాలు.

పట్టలేక పక్కుమని నవ్వింది. ఆ నవ్వు ఎండకే కాంతి నిచ్చింది.

ఆ మత్తుకి మాధుర్యానికి ఆకాశం కిందికి దిగి రాలేదా? గాలి యీ వార్త ముల్లోకాలలో ప్రకటించలేదా? ఆ కాంతికి అంతా ఒకవైపై తనకి పోటీ ఇవ్వలేదా— యీ చెట్లు, పక్షులు. కీటకాలు, మృగాలు, యీ అనంతాకాశం, సూర్య చంద్రులు, యీ లోకమే తన పరిమళ సౌభాగ్యం కోసం సృష్టి పొందలేదా!

తన ముందు ఇంకెవరు!

ఆల్లరిగా గంతులేసింది. చప్పట్లు కొట్టింది. కళ్ళలోంచే కాంతుల్ని విసిరింది. ఎవరు అటు వెళ్ళినా ఆకులవెనక దాక్కుని తొంగిచూసి పకపక నవ్వింది. తన రేకుల్ని పూసింది. పరిమళాన్ని ఎక్కడా అంతులేని భాగ్యంమల్లే విరజిమ్మింది. ప్రపంచం మీద.

సంగీతాలతో, నృత్యాలతో సోలుతో, తూగుతో, చుట్టూ మధుపాలు సేవించి వెంబడి రాగా, పూలని లెఖ్ఖకింద తలెత్తి చూడకుండా, గర్వంగా, యవ్వనంతో మదించి, వొంటినిండా పచ్చని పుష్పరజం చల్లుకుని పోతున్నాడు, మధుపం.

ఎండలో రజంలోంచి నల్లని మెరిసే అతని దేహం. క్రూరమైన తొండం. రక్తంవలె ఎర్రనైన కళ్ళు, గాలిని శూలాలవలె గుచ్చే పెద్దమీసాలు చూసి వణికింది పువ్వు.

'అమ్మా! ఎవరిది? అని తల్లి ఆకుపచ్చ పమిటలో దూరింది.

నవ్వి కూతురు తల నిమిరింది.

'నీ జోలికి రాడులే' అంది కొంటెగా తల్లి.

'రాడా? ఎంత జాగరు?' అంటో ఆకుల్లోంచి సగం తొంగిచూసి, పరిమళాల్ని విసిరింది పువ్వు. పూసిరాడనీక మోహానికి అడ్డుపడి, రెక్కల బలాన్ని లాగేసే ఆ పరిమళానికి తల తిరిగి ఆగాడు మధుపం.

'అమ్మా! ఆగాడు' అంది భయంగా పువ్వు.

తనని ఆగనీక, నిలవనీక, ఏమిటి ఆ బాధ? తియ్యని మత్తెక్కించే ఆవేదన! ఏమిటో తనకి తెలీక, భయపెట్టి తనని తొందరచేసే ఆ కాంక్ష!

తిరిగాడు తనవేపు.

పొమ్మన్నాడు అనుచరుల్ని, మళ్ళీ ఇంకోసారి కొత్తపూరజం అతని నిండా చల్లి అలంకరించి ఎగిరిపోతున్నారు మిత్రులు. చుట్టూ ఆకులమీద వాలి నవ్వుతున్నారు పోకిరివాళ్ళు.

తనవేపు ఎగురుతున్నాడు, అతను బలంగా ధైర్యంగా అతనికి ఎవరు ఎదురు అన్నట్టు. ఎండలో మెరుస్తో, తేలుతో, గాలిని చీల్చుకుంటో వొస్తున్నాడు అని వార్యంగా, సిగ్గు, సిగ్గు, సిగ్గు.

తన గర్వం, ఆధిక్యం, విజృంభణ— ఏమీలేవు
దాక్కుంది ఇంకా లోపలగా.
వొస్తున్నాడని భయం, సంతోషం.
తీరా రాడేమోనని దిగులు, న్యూనత.
వొస్తున్నాడని గర్వం, పిగ్గు.
ఏమిటి అంత స్వతంత్రం?
ఏమిటి ఇంత ఆలస్యం?
తమ తప్ప ఇంకేం కనపడకుండా ఐ, తనచుట్టూ ప్రాధేయపడి పాడాలి.
తాను మాత్రం అందక, ఆకుల్లో తప్పించుకుని వేధించాలి.

నిర్లక్ష్యంగా అవలీలగా ఆకుల్ని వొత్తిగించి, తనని నలుగురి ముందూ బాహాటం చేశాడు. కిర్రిగంటితో చూసి 'ఫో! ధూర్తుడా!' అంది. కాని [illegible] స్వరమేనా అది? ఏమిటా తియ్యదనం. ఆ ఆహ్వానం? తనెంత ప్రయత్నించినా తనకి లొంగని ఆ హృదయారాటం? పెదల్పయిన స్వరంతో, జుమ్మమనే ఆ [illegible] ప్రేమ గీతాన్ని ఆలాపిస్తో తనచుట్టూ తిరుగుతున్నాడు. ముందు కాళ్ళని [illegible] జాచి, రెక్కలమీద రంగు రంగులుగా మెరుస్తో ఎండ. అతని వొంటిమీద [illegible] మదపు వావన తల తిప్పుతోంది.

పొంగివొచ్చే ఆ వరదమల్లే ముంచేసింది తన కింకేం తోచకుండా ఆ [illegible] గీతం, సముద్రపు హోరుమల్లె రక్తపుపోటుమల్లే.

అడుగుతున్నాడు, నవ్వుతున్నాడు, తలవొంచి ముందు కాళ్ళతో [illegible] పడుతున్నా, నీకోసమే అనంత కాలంనించి వెతుకుతున్నాను. నా [illegible] పాదాల ముందు గుమ్మరిస్తాను.

తలెత్తి ఒకసారి నావంక చూడు, అంటున్నాడు.

అన్నీ అబద్ధాలు. కాని, ఎంత మధురమైన అబద్ధాలు, [illegible] అన్నాడు. ఆ పుష్పరజమంతా ఎక్కడిదో? ధూర్తుడు.

తను తెల్లని రేఖలు మెరిపించి చిన్ననవ్వు నవ్వి దాక్కుంది ఆకుల [illegible] గాలి సహాయంతో.

అతను బలహీనంగా, మృదువుగా కొమ్మల్లోనూ దాక్కునే తనకోసం ఇంకా రాడేం? వెళ్ళిపోడుగదా? మెరుస్తో. రెక్కల పూవుతో, లెక్కలేని పూవుల మధ్య ముల్లోకాలలో అవలీలగా సంచారం చేయగల్గిన ఆతడు– ప్రత్యేకం తనకోసం– తన ముందు ప్రాధేయ పడుతున్నాడు.

'పో!' అంది, పోతాడేమోనన్న భయంతో, మధుపం ఆ మాటతో ఆమె తన స్వంతమైనట్టు, అధికారమైనట్టు, సంకోచం లేకుండా విహరించే రాజ్యసీమ ఐనట్టు, కరుకు గోళ్ళతో, మృదు పత్రాలు ఏమౌతున్నాయో అనే దృష్టిలేకుండా వాలాడు పువ్వుమీద.

'అమ్మా! అని పెద్దకేకేసింది– ప్రాణం పోతున్నట్టుగా.

అమ్మ పలకలేదు తనని వొదిలారా? అందరూ వొదిలారా? ఇదే అంతమా? తన ప్రాణాలు ఎగిరి పోతున్నాయి.

నిర్దయగా, ఏమీ తన అనుజ్ఞలేకుండా, క్రూరంగా, గోళ్ళతో చీల్చి, తల దూర్చి, తను ఎన్నడూ తనలో ఉన్నదని తెలీని, తన గర్భకుహారాంతరాన్ని ఛేదించి తాగుతున్నాడు మధువునంతా. వొళ్లు చీలికలౌతోంది, ఒక్కొన్నే తాగుతున్నాడు, వెనక కాళ్ళతో పక్కల్ని సాగదీపి చింపుతున్నాడు. ఇంకి తనెట్లా ఐకకడం? ఎట్లా మొహమెత్తడం? కాని అప్రయత్నంగా రేకలతో అతన్ని కప్పి దాచుకుంది, తన ఈనెలతో సన్నని వొంపుతీరిన నడుముని కావిలించుకుని దగ్గరికి లాక్కుంది. తనలోని పచ్చని పరిమళపు గంధాన్నంతా అతనినిండా చల్లింది. తననే తానర్పించుకుంది.

'ఇంక నన్ను వొదిలి వెళ్ళకుమని' వేడుకుంది.
'నేను నీదాన్నంది, 'నీకన్నా ఇంకేం లే'దంది.

ఇంకా, ఇంకా, ఇంకా– నాలో ఇంకేం మిగలకుండా నా ప్రాణాన్నే, ఆత్మనే తాగెయ్యమని రహస్యం పలికింది,

ఝల్లుమంది వొళ్ళు, తాను చూపిన సూర్యులు వెయ్యిమంది తన కళ్ళముందు భగ్గుమన్నారు.

రాత్రి నక్షత్రాలన్నీ ధగధగ తనచుట్టూ నాట్యం చేశాయి. సముద్రాలు హోరుమన్నాయి. ఎట్లా భరించడం యీ ఆనందం! యీ బాధ, యీ తీపి, యీ తీపు!

గుండె బద్దలుకాదా! నాళాలు చీలిపోవా? తన రేకులే చింపుకుని రాలిపోవా?

ఆగలేక పట్టుకుంది. దగ్గరిగా కప్పేసింది. మూర్ఛపోయింది.

వొదిలేశాడు తనని కరుణామయుడు, మధుమూర్తి, తనని వొదిలేసి, తనకళ్ళలోకి నవ్వాడు.

ఏమియ్యగలదు తాను? చాలా హాయిగా సంతుష్టితో తనకళ్లలోకి నవ్వాడు.

ఎవరు? తానెట్లా తీర్చుకోగలదు, ఈ కృతజ్ఞతని! నమ్రతతో నమస్కరించింది.

తనమీద కాళ్ళూని, అవలీలగా గాలిలోకి ఒక్కదూకు దూకి, చీకటి వెలుగులాగు మెరిసి రెక్కల్ని జాచి, ఒక్కచూపు తనవైపు వెనక్కి చూడకుండా వెళ్ళిపోయినాడు. అతని నెచ్చెలిగాళ్లని ఒక్క కేకతో పిలిచి, వాళ్లతో ఉల్లాసంగా, నవ్వుతో తన ఉనికినే మరిచి, అతని వెంటబడి అడ్డుపడే తన హృదయాన్నే తోసేసి, తనకు తెలీని తాను అందుకోలేని, నీలపు లోకాల్లోకి, ఆకుపచ్చ కాంతుల మధ్యనించి ఎగిరిపోతున్నాడు. కనపడ్డంత దూరం దిగులుతో తలవొంచి చూస్తోంది. తానా? కదలడం చాతకాదు.

ఆకుల తెరచాటున సిగ్గుగా పెరిగిన కన్య.
ఏమని తాను లోకం కళ్ళముందు, సిగ్గువిడిచి, అతన్ని అనుగమించగలదు?

తనకే రెక్కలుంటేనా? ఇంక ఎటు చూడకుండా తల్లిని, తండ్రిని, ఆకుల్ని, మిత్రుల్ని, సమస్తమూ మరిచి అతనివెంట సహచారిణి అయి సేవ చెయ్యదా? కాని అబల.

దీవిస్తున్నారు, లాలిస్తున్నారు.
తనచుట్టూ చిన్నచిన్న వనకన్యలు చేరి పాడుతున్నారు.
తన వొంటివంక గర్వంగా చూసుకుంది.

ఎంతో సాఫల్యంతో, నిండుతనంతో, లోతుకో బయపెక్కిన తనవంక చూసుకుని పొంగి పోయింది.

సూర్యుడు పైకిలేచి పెద్దచెట్ల ఆకు నీడల్ని మంట పెడుతున్నాడు. గుంపులు గుంపులుగా చిలకలు ఆకుపచ్చ మెరుపుల మల్లే ఎగిరి పోతున్నాయి. సీతాకోక చిలుకలు తప్పతాగి ఎండలో తూలుతున్నాయి, రంగు రెక్కల్ని గర్వంగా గాలిలో చాచి, సోమరిగా తేలిపోతున్నాడు గరుడుడు మబ్బుల మధ్య.

మెల్లగా పొట్టిపైపోయే నీడల్ని సోమరిగా చూస్తో, శాంతంగా కూచుంది. పువ్వు బలంగా శక్తిని భూమి వేళ్లలోంచి తనలోకి లాక్కుంటో. తన అందమంతా పోతేనేం; పరిమళం లేకపోతేనేం? కేసరాలు అవిసి, వాడిలి తన పత్రాలమీదనే వాలిపోతేనేం? తనపైపుకి కాంక్షతో మధుపాలు చూడకపోతేనేం? ఇప్పుడు తన చూపు తన లోపలికి— తన జీవితానికి అర్థమే మారిపోయింది.

తన లోపల క్రొత్త ప్రాణం కదులుతోంది. చోటుకోసం వెతుక్కుంటో తన పక్కల్ని సాగతీస్తోంది. మధువం తననిండా విరజిమ్మి పోయిన పుష్పరజంతో పచ్చనై జారిపోయిన తన పత్రాల్ని ఎండ వెచ్చదనానికి వప్పచెప్పి, తనచుట్టూ జరిగే సృష్టి ఉత్సవంలో తానూ ఒక ముఖ్య పాత్రధారిననే గర్వంతో, ఇంకేం కావాలి అనే స్థిమితంతో, నిర్లక్ష్యంగా చూస్తోంది— క్షణమైన ఆగని నిరంతరంగా అలలమీద నాట్యం చేసే సృష్టిలీలని.

గాలిమీద చిందులు తొక్కుతోంది ఎండ.

ఆకాశాన మధ్య మండిపడే భాస్కరుడి కంటపడింది ఆ పువ్వు తల్లి. క్రూరంగా చూస్తో ఎదుట నిలిచింది కాలం. పరిమళంలేని, మధువులేని, రంగుతప్పిన ఆ పువ్వుని అనవసరమని తలవూపింది సృష్టి. రేకులు రంగు తప్పి ముడతలు పడ్డాయి. కేసరాలు ఒక్కొక్కటే వూడి జాలిగా కింద ఆకులమీద వాలుగాలి పూపుకి దుమ్ముకో పడ్డాయి. కాని దృష్టిని తనగర్భం వేపు తిప్పి, తననీ, తన అందాన్నీ ప్రపంచాన్నే మరిచింది పువ్వు.

మబ్బులనించి చివరి రంగుల్ని పిలుచుకుని సూర్యుడు ఎప్పుడు కడసారి శెలవు చెట్ల చిటారికొమ్మల మీది గరుడులనించి తీసుకొని వెళ్ళిపోయాడో, ఎప్పుడు శాంతి గీతాల్ని వాయుకుమారులు పాడి కొమ్మల్లో కూచున్నారో, ఒక్కక్షణం విశ్రాంతిలేక

తిరిగిన జీవులన్నీ ఎక్కడెక్కడ అన్ని వ్యాపృత్తుల్నీ వొదిలి నీడల్లో వొదిగాయో, పక్షులూ, కోతులూ తమ తలపై గుబుర్లలో ఎప్పుడు మాటుమణిగాయో గమనించనైనా లేదు పువ్వు.

వెతికి వెతికీ మూల మూలల దాక్కున్న వెలుతురుని మింగేస్తోంది వెయ్యి నాలుకలతో చీకటి.

మొదటి నక్షత్రపు మిణుకు మిణుకులోంచి జారిన కాంతిరేఖ మీద కూచుని వొచ్చి నిలిచాడు తనముందు.

తనపేరు పిలిచాడు.

'ఎవరు' అంది పువ్వు. కాని తెలుసు తనకి.

గజగజ వొణికింది. చుట్టూ చూచింది ఏడుస్తో.

'రా' అన్నాడు.

'నా పాపాయి' అంది.

'నీ ప్రాణాన్ని నీ పాపాయి కిచ్చి నాతోరా' అన్నాడు నవ్వుతో.

'ఎట్లా రానూ !' అని అరిచింది చివరి అరుపు.

తన చేతిని పట్టుకుని, కన్నీళ్ళు తుడిచాడు.

'చూడు' అన్నాడు.

లోకమంతా పెద్ద వెలుగు. అన్ని రూపాల్నీ, భిన్నత్వాల్నీ తనలో కరిగించుకుంటున్న మెత్తని వెలుగు నేలమీది ఎండుటాకుల నించి, ఆకాశాన నక్షత్రాల దాక అన్నిటిని ఏకం చేసే దివ్యకాంతి.

అంతా, అంతా ఆ వెలుగంతా అతను. అన్ని చోట్లా అతను.

పొట్టలోని ఆకల్ని నింపుతో, పట్టుకు చీల్చుకు తింటో, చీకట్లో దాక్కుంటో పిల్లలకి రసం తాగిస్తో, చంపుతో, ఏడుస్తో, నవ్వుతో, కోపంతో, మాకుతో, ఆనందంతో, వూగుతో — ప్రతి మూలా అతను, తన పాపాయిని లాలిస్తో ఆడిస్తో అతను.

నవ్వుతో తన వార్ధక్యం, నిరర్థకత్వం, ఎండు తనం అంతాపోయి బాల్యం యవ్వనం.

బలం, సంతోషం, మాతృత్వం, ప్రేమ, అన్నీ అతని ముందు అర్పించి మొక్కింది.

అతని చెయ్యి పట్టుకుని అనంతాకాశంలోకి ఒక్క దూకు దూకింది.

ఇంక భయమనేది లేదు. విచారం లేదు. సందేహం లేదు. సమస్తమైన ప్రపంచంతో, కాలంతో అతి సన్నిహితు డతడు— అతని వేళ్లను పట్టుకున్న తననింక ఏ మూల ఏ రూపంలో నిలిపినా ఆకొత్త వుండదు. తనకోసం చేతులు జాచి వుంటాయి. చిరునవ్వులు వెలసి వుంటాయి. తన ఆగమనం కోసం గొప్ప విలువ వుంటాయి.

ఆకాశంలో తేలుతో, భక్తితో అతని మొహం వంకచూసి పక్కున నవ్వింది— ఆనందాన్ని ఆపుకోలేక.



# 1. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

## 1865 - 1940

ఈ వ్యాసము శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన "సాక్షి" మూడవ సంపుటము నుండి గ్రహింపబడినది. ఆంగ్ల సాహిత్యమునందు ఎడిసన్ అను కవి రచించిన 'స్పెక్టేటర్' అను వ్యాసములననుసరించి వీరు 'సాక్షి' ఉపన్యాసములను వ్రాసి ఆంధ్ర పత్రికలో కొంతకాలము వరుసగా ప్రకటించి యుండిరి. శ్రీ కందుకూరి వీరేశలింగంగారి ఒరవడిలో సంఘమును సంస్కరించు నుద్దేశముతో వీరు ఈ 'సాక్షి' ఉపన్యాసములను కొనసాగించిరి. సాంఘిక దురాచారములను, పాశ్చాత్య నాగరికతా వ్యామోహము, నీతి బాహ్యమైన ప్రవర్తన - వీనిని హాస్యోక్తులతో, వ్యంగ్య మర్యాదతో ఎత్తిపొడుపు మాటలతో వాడిగా - వేడిగా విమర్శించిరి. ఇందులోని జంఘాల శాస్త్రి, వాణీదాసుడు, కాలాచార్యుడు మరియు బొర్రయశెట్టి పాత్రలు నేటి సంఘమునందు ఆయా స్వభావము ప్రవృత్తులుగల వ్యక్తులకు ప్రతినిధులని చెప్పవలెను.

పానుగంటివారికి సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషలలో విశేషమైన పాండిత్యముగలదు. పిఠాపురం, మహారాజారావు, సూర్యారావుగారి ఆస్థానమున పండితులుగా, ఆస్థాన కవులుగా ఉండిరి. వీరి 'సాక్షి' వ్యాసములు తెలుగు వాఙ్మయములోనే అపూర్వము. వీనియందు వీరు ప్రయోగించిన శబ్దవైచిత్రి తెలుగు వచన రచనలో వీరికొక ప్రత్యేక శైలిని సంపాదించి పెట్టినది. ఒకే విషయము వివిధ భంగులుగా మార్చి మార్చి చెప్పుట వీరి ప్రత్యేకత. సంస్కృత సమాసములు వాడినను వీరి రచన వ్యవహారికమునకు సన్నిహితమై సరళ సుందరముగా నుండును.

వచన రచనయందేగాక వీరు నాటకములను రచించుట యందు సిద్ధహస్తులు. వీరు పౌరాణిక, చారిత్రక, కల్పిత నాటకముల నెన్నింటినో వ్రాసిరి. 'రాధాకృష్ణ.' 'కంఠాభరణము' 'విప్రనారాయణ' వీనిలో ప్రసిద్ధమైనవి.

వేమన హాస్యమునకు ఎంత ప్రసిద్ధియో నీతులకు అంతకన్న ప్రసిద్ధి అయితే ఆయన నీతులు అనుభవంనుంచి వచ్చినవి కనుక అది కేవలం సూక్తులుగా మిగిలిపోక మన మనసుల్లోకి లోతుగా ఇంకిపోతాయి.

ఇతర ప్రచురణలు : సారస్వతాలోకము, నాటకోపన్యాసములు.

## 3. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి

తెలంగాణ ప్రాంతంలో సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య వికాసం కలిగించిన వైతాళికులలో సురవరం ప్రతాపరెడ్డిగారొకరు.

బోరవెల్లి అప్పుడు గద్వాల సంస్థానానికి రాజధాని. నైజాం ప్రభుత్వ పతనానంతరం గద్వాల మహబూబ్‌నగర్ జిల్లాలో ఒక తాలూకాగా మారినది.

మహబూబ్‌నగర్ జిల్లా బోరవెల్లి గ్రామంలో తన మాతామహుల గృహంలో 1896 మే 28 న జన్మించి ఉన్నత విద్యను పొంది ఆంధ్ర మహాసభలో పాల్గొని నైజాం వ్యతిరేక ప్రజా ఉద్యమంలో పాల్గొన్నాడు. 'గోల్కొండ పత్రిక' ను స్థాపించి 1925 లో ప్రజా చైతన్యానికి పత్రికను నొక బలమైన సాధనంగా వినియోగించాడు.

గ్రంథాలయోద్యమం, చరిత్ర పరిశోధన, పత్రికా రచన, సాంఘిక సేవ సాంస్కృతిక రంగంలో కృషి- ఇవే ఆయనను స్టేట్ కాంగ్రెస్ రాజకీయాల్లో కూడ ఆసక్తి తీసుకోవడానికి దోహదం చేసినవి.

ప్రపంచ ప్రజలందరివలెనే భారతీయులు కూడ వేలాది సంవత్సరాలుగా తమ చరిత్రను తామే నిర్మించుకుంటున్నారు. అయితే చరిత్ర రచన మాత్రం మనకు బ్రిటిష్ వలస పాలనతోనే ప్రారంభమయింది. పాలకులు రచించే పాలితదేశాల చరిత్ర ఎలా వుంటుందో వూహించవలసినదే

శాసనాలు, సాహిత్యం, జానపద ఆచార, కళా, వ్యవహారాలు మొదలైనవాని ఆధారంతో దాదాపు రెండువేల సంవత్సరాల రాజుల చరిత్రము కాక సాంఘిక చరిత్రను నిర్మాణం చేయడానికి మొట్టమొదటి కృషిచేసిన చరిత్రకారుడు శ్రీ సురవరం ప్రతాపరెడ్డి.

ఆయన 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ఈనాటికీ చరిత్ర రచనకు ఒరవడి కాదగిన గ్రంథం. ప్రస్తుత పాఠ్యాంశం 'రెడ్డి రాజుల కాలము వ్యవసాయము - ప్రజల స్థితి' ఆ గ్రంథం నుంచే గ్రహించబడినది. చరిత్రంటే రాజుల దండ యాత్రలు, రాణుల ప్రేమ పురాణాలు కాదని ప్రజల జీవన విధానము, స్థితిగతులను తెలుసుకొనుట అని మనకి పాఠ్యాంశాన్నిబట్టి అర్థమవుతుంది.

నిజాం రాష్ట్ర పాలనము, గ్రంథాలయోద్యమము, హిందువుల పండుగలు, హైందవ ధర్మవీరులు, సంఘోద్ధరణము, ప్రాథమిక సత్యములు లేదా ప్రజాధి కారములు, రామాయణ విశేషములు, ఆంధ్ర లిపి సంస్కరణము, యువజన విజ్ఞానము, ప్రతాపరెడ్డి కథలు వీరి ముఖ్యమైన రచనలు.

## 4. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

హేతువాద, శాస్త్రీయ దృష్టితో తెలుగులో కథ, నవల మొదలుకొని వ్యాసం వరకు సూటిగా, సులభంగా నిర్విరామంగా ఏభై ఏళ్ళపాటు రచించిన ఆధునిక రచయిత శ్రీ కొడవటిగంటి కుటుంబరావు.

1909 అక్టోబర్ 28న తెనాలిలో పుట్టి 'నవ్యసాహిత్య పరిషత్తు' నాటి సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాల ప్రభవంలో పెరిగి బెనారస్ యూనివర్సిటీలో ఎం.ఎస్సి. చదువులో ప్రపంచ వ్యాప్తంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం కారణంగా ఉద్యోగాన్వేషణలో పలు ప్రాంతాలు తిరిగాడు. చివరకు 1950లో 'చందమామ' పత్రికలో సంపాదకుడుగా స్థిరపడి మరణించేదాకా మద్రాసులోనే ఉన్నాడు. ఒక్క కవిత్వం తప్ప ఆయన చేబట్టని సాహిత్య ప్రక్రియలేదు. తెలుగు దేశములో వచ్చిన అన్ని సాహిత్యోద్యమాలతో ఆయనకు సన్నిహిత సంబంధం వున్నది.

మానవీయశాస్త్రం, చరిత్ర, విజ్ఞానశాస్త్రం అధ్యయనం చేసి సాహిత్యంలో వానివలన విరించగల విస్తృతిని, వైవిధ్యాన్ని, దృక్పథాన్ని రంగరించి తెలుగుసాహిత్యాన్ని సుసంపన్నం చేసిన మేధావి ఆయన.

స్వతంత్రంగాను, అనువాదాల ద్వారాను విజ్ఞానశాస్త్ర విషయాలను సులభంగా తెలుగు పాఠకుల కందించిన వారిలో ఆయన ఒకడు. ప్రస్తుత పాఠ్యాంశం 'అపార పారావారం' 'ఎల్లలెరుగని కడలి' అనే పుస్తకం నుంచి గ్రహించబడింది.

మనకు భూగోళం కన్న మూడు రెట్లు పెద్దదె, భూగోళంలో వనరుల్లు తగ్గి జనాభా మరింత పెరిగినపుడు భవిష్యత్తులో మరింతగా ఆధారపడవలసింది అయిన సముద్రం గురించి తెలిసింది చాల తక్కువ. పై కాల్యానికి, లోతుకు పోలిక చెప్పి నపుడు సాహిత్యంలో సముద్రం గురించి సమగ్రమైన అవగాహనతో చెప్తున్నమను కోవడానికి వీలులేదు. కనుక సముద్రాన్ని ప్రత్యక్షంగా చూడాలి. అర్థం చేసుకోవాలి.

## 5. శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు

శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు 1907 లో కృష్ణా జిల్లా, గుడివాడ తాలూకా వెంట్రప్రగడలో సామాన్య రైతుకుటుంబంలో జన్మించారు. వీరు బందరు జాతీయ కళాశాలలో మెకానికల్ ఇంజినీరింగు కోర్సు చదువుతుండగా 1929 లో గాంధీజీ ఆంధ్రప్రదేశ్ పర్యటనకు వచ్చారు. ఆయన చేసిన జాతీయోద్యమ ప్రబోధంతో ఉత్తేజితులై 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో, తర్వాత విదేశీ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో పాల్గొన్నారు.

చారిత్రిక దృష్టితో సాహిత్యాన్ని అధ్యయనం చేసిన మేధావి 1937 లోనే 'నవశక్తి' పత్రికకు సంపాదకులయ్యి ప్రజాదృక్పథంతో పత్రికా రచనచేసే సంప్రదాయాన్ని తెలుగులో నెలకొల్పారు.

స్వతంత్రాబాకత్, ప్రజాశక్తి మొదలైన పత్రికలకు పీళ్లతరబడి సంపాదక బాధ్యతలు నిర్వహించారు. 1952 లో ప్రారంభమైన 'విశాలాంధ్ర' దిన పత్రికకు 57 వరకు ప్రధాన సంపాదకులు, 68 వరకు సంపాదకవర్గ సభ్యులు.

సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్రను పరిశీలించి ఆయా కాలాల్లో ఆయా ప్రక్రియలు ధోరణులు రావడానికి కారణాలు విశ్లేషించిన సాహిత్యవిమర్శకులలో ముందు శ్రేణిలోనివారు శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు.

'చంద్రం'గా సుప్రసిద్ధులైన వీరు పత్రికా రచన అంటే ప్రజలపట్ల బాధ్యత వహించే అక్షరనిబద్ధత అని నిరూపించారు.

1974 జులై 26 న చంద్రంగారు మరణించారు.

ప్రస్తుత పాఠ్యాంశం 'ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు' విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురించిన 'చంద్రం వ్యాసావళి' నుండి గ్రహింపబడినది.

1857 ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం దేశవ్యాప్తంగా తెచ్చిన నూతన వికాసం తెలుగు సాహిత్యరంగంలో కూడ తన ప్రభావాన్ని చూపింది. సంఘ సంస్కరణకు సాహిత్యాన్ని శక్తివంతమైన పనిముట్టుగా వినియోగించుకునే క్రమాన్ని వీరేశలింగం పంతులు ప్రారంభించారు. సాహిత్యవస్తువు గురించి ఆయన ప్రవేశ పెట్టిన అవగాహనకు వాడుకభాషా ఉద్యమం ద్వారా గిడుగు, గురజాడలు, జోడించిన వ్యక్తీకరణ పద్ధతి పదనుపెట్టింది. గురజాడతో ఆధునిక ఆలోచనా ధోరణికూడ ప్రారంభమైంది. కన్యాశుల్కం, మాలపల్లి, మహాప్రస్థానం తెలుగు నాటక, నవలా కవితా ప్రక్రియలకు సరియైన దారులు నిర్ణయించాయి.

# 6. శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య

రాజనీతి శాస్త్రజ్ఞుడుగా, విద్యావేత్తగా తెలుగునాట శ్రీ మామిడిపూడి వేంకట రంగయ్యగారు సుప్రసిద్ధులు. ఆంధ్ర, కర్నాటక, బొంబాయి విశ్వవిద్యాలయాల్లో చరిత్ర రాజనీతి శాస్త్ర విభాగాలకు బాధ్యులుగా వ్యవహరించి వివిధ బాధ్యతల్లో ఆయా శాఖలను తీర్చి దిద్దిన నారాయన.

విద్యావేత్తగా విద్యారంగంలో ఈనాడు ఎదురవుతున్న ఎన్నో సమస్యలపట్ల ఆయన మనసుపెట్టి, ఆలోచించి, చర్చించి తనకు తోచిన అంశాలు ప్రతిపాదించాడు. 'తెలుగు విద్యార్థి' పత్రికలో విద్యావిధానంపై ఎన్నో వ్యాసాలు ప్రచురించడమే కాకుండా సంవత్సరాల తరబడి వరుసగా పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇచ్చారు.

తెలుగు భాషా సమితి తలపెట్టి ప్రచురించిన 'తెలుగు విజ్ఞాన సర్వస్వము' కృషిలో వెంకటరంగయ్యగారు ప్రధాన పాత్ర నిర్వహించారు.

ప్రస్తుత పాఠ్యభాగము 'సాంస్కృతిక పునరుజ్జీవనము' తెలుగు విజ్ఞాన సర్వస్వము మూడవ సంపుటి నుండి గ్రహింపబడినది. బ్రిటిష్ వలస పాలన ప్రత్యక్షంగా బెంగాల్ విభజనకు. పరోక్షంగా తెలుగు దేశ విభజనకు కారణం కాగా ఇంగ్లీషు విద్యా విధానం తిరిగి మనలో జాతీయోద్యమ భావాలు రగుల్కొనడానికి దోహదం

చేసింది. ఆంధ్రుల చరిత్ర సంస్కృతులను ప్రాచీన కాలంనుండి త్రవ్వివేసి వర్తమాన పరిస్థితులకు అన్వయించుకొని ఉజ్వల భవిష్యత్తును నిర్మించుకోవాల్సిన అవసరాన్ని గుర్తించిన కాలాన్నే మనం 'సాంస్కృతిక పునరుజ్జీవన' దశగా పేర్కొంటున్నాం. ఈ సాంస్కృతిక పునరుజ్జీవనము సాహిత్యము నందు లలిత కలలయందు అభివ్యక్తమయిన విధమీవ్యాసంలో చర్చించబడింది.

## 7. శ్రీ పాములపర్తి సదాశివరావు

శ్రీ పాములపర్తి సదాశివరావుగారు వరంగల్లు నగర వాస్తవ్యులు, విద్యాధికులు. సాహిత్య మరియు రాజకీయ క్షేత్రములందు మేధావియై ప్రస్తుతము భారత ప్రభుత్వ విదేశాంగామాత్యులైన శ్రీ పి. వి నరసింహారావుగారికి వీరు జ్ఞాతులు. సునిశితమైన విమర్శనాశక్తి మరియు తాత్త్వికచింతన గలవారు. తత్త్వశాస్త్ర ప్రథమ పాఠాలు. చరిత్ర, కళ, సంస్కృతి; జ్ఞానసిద్ధాంతం అను గ్రంథములను వీరు రచించి ప్రకటించారు.

కళలయందు— ముఖ్యముగా సంగీత సాహిత్యములయందు— సదాశివరావు గారికి మిక్కిలి అభిరుచి మరియు ఆసక్తిగలదు. ఆంధ్రాంగ్ల హిందీ మరియు ఉర్దూ భాషలలోగల అనేక గ్రంథములను విమర్శనాత్మక దృష్టితో పఠించి అందలి విషయములను చర్చించు సామర్థ్యము కలిగియున్నారు. కాకతీయ కళాసమితి — కాకతీయ పత్రికలను ఉత్సాహముతో నడిపి యున్నవారు.

ప్రస్తుతము వీరు "స్వరాలప్తి - లయవిన్యాసం" అనే విషయంపై పరిశోధన కావిస్తున్నారు.

ఈ వ్యాసమువారు రచించిన "చరిత్ర - కళ, సంస్కృతి" అను గ్రంథము నుండి గ్రహింపబడినది.

మనిషి లేకపోతే విజ్ఞాన శాస్త్రములేదు. కళలు లేవు కళల విజ్ఞానం మనిషి యొక్క ఆదేశ పూర్వకమైన, చైతన్యయుతమైన చర్య అయితే ఈ మానవుని చైతన్యం భౌతిక పదార్థాలనుండి ఏర్పడుతున్నది. అంతేకాని మానవుడి చైతన్యమే భౌతిక పదార్థాలను సృష్టి చేయడంలేదు.

చైతన్యము (Consciousness) - ప్రవృత్తి (instinct) అనే రెండు పదాలు మనస్తత్వశాస్త్రంలో వినిపిస్తుంటాయి. మానవునిలో ఈ చైతన్యం ఎలా రూపొందింది? చైతన్యము - ప్రవృత్తికి గల సంబంధమెట్టిది? చైతన్యము లేని ప్రవృత్తి ఎలావుంటుంది. మానవ వికాసమునకు చైతన్యం ఎలా ఉపకరిస్తుంది? ఇలాంటి ప్రశ్నలకు ఈ వ్యాసంలో సమాధానమివ్వ ప్రయత్నము జరిగినది.

# 8. శ్రీ తాపీ ధర్మారావు

1887 సంవత్సరం సెప్టెంబర్ 19వ తేదీన బరంపురంలో పుట్టారు.

1902 - 3 లలో విజయనగరానికి వచ్చిన సురభి నాటకాల కంపెనీతో నాటక రంగం పట్ల ఆసక్తి - వీరేశలింగంగారి రచనలు చదవడంవల్ల సంఘ సంస్కరణ పట్ల అభినివేశం కలిగింది. పర్లాకిమిడిలో గిడుగు రామమూర్తిగారి శిష్యరికంవల్ల అధ్యయనం పట్ల శ్రద్ధపెరిగింది. ఎఫ్. ఎ. (ఇప్పటి ఇంటర్) చదువుకున్న రోజుల్లోనే ప్రబంధాలన్నీ చదివాడు. 1909 లో బి. ఎ. పూర్తిచేసారు.

తాపీ ధర్మారావుగారు పరమ ఛాందసభావాలనుండి అభ్యుదయ భావాలవైపు పయనించారు. సాహిత్యంలో అన్ని ప్రక్రియలను చేపట్టి రచనలు చేసారు పత్రికా రచనలో వాడుకభాషను ప్రవేశపెట్టారు. సినిమా రంగంలో ప్రవేశించి సులభ భాషలో ప్రబోధాత్మక పాటల్ని రచించారు.

సాహిత్యాన్ని మానవీయశాస్త్రం, సామాజికశాస్త్రం చరిత్ర దృష్టితో పరిశీలించి తన సాహిత్య రచనకు వానిని ప్రాతిపదిక చేసుకున్నారు.

పెళ్ళి- దానిపుట్టు పూర్వోత్తరాలు దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు, కొత్తపాళీ, పాతపాళీ, సాహిత్య మొర్మరాలు మొదలైన ఆయన రచనల్లో మనకి పరిశోధనాదృష్టి కనిపిస్తుంది.

విజయ విలాసానికి ఆయన వ్రాసిన వ్యాఖ్యానము ఉల్లాసకరమైనది. దాదాపు ఒక శతాబ్దకాలపు తెలుగు సాంఘిక, సాంస్కృతిక, సాహిత్య జీవితాన్ని అర్థం చేసుకోవడానికి దోహదం చేయగల స్వీయ చరిత్రను ప్రారంభించి తన కళాశాల జీవితం చెప్పేవరకే అది ఆగిపోయింది. ఆయన సహజ హాస్యశైలిలో ఎంతో ఫలవంతమైన తన స్వీయ చరిత్రకుకూడ 'రాలూ-రప్పలూ' అని పేరు పెట్టాడు.

తెలుగు సాహిత్యరంగంలో పరిచయమున్న ప్రతివారికీ 'తాతాజీ'గా ఆప్తుడయిన తాపీ ధర్మారావుగారి 'కొత్తపాళీ' నుంచి ఈ పాఠ్యభాగం గ్రహించబడింది. ఈ 'కొత్తపాళీ' లోని వ్యాసాలు 'ప్రజామిత్ర' వార పత్రికలో 1936 జనవరి నుంచి సంచిక నుంచి కొన్ని నెలలపాటు ప్రకటితమై 1955 జులైలో మొదటిసారిగా విశాలాంధ్ర ప్రచురణగా పుస్తక రూపంలో వెలువడినయి

ఏ విషయం చెప్పినా 'అందరికీ తెలిసేటట్టుండాల'ని, అందుకు భాషవ్యక్తీకరణ సాధనం గనుక అది సులభంగానూ సూటిగానూ వుండాలని ఈ వ్యాసంలో తాపీవారు సూచిస్తారు.

## 9. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ( 1888-1950 ) సుప్రసిద్ధ చరిత్ర మరియు భాషాపరిశోధకులు. వీరు కృష్ణాజిల్లా వాస్తవ్యుల. శ్రీ చెల్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి శిష్యులై విద్యార్జనము గావించిరి. పిదప మదరాసునగరముచేరి అక్కడి విద్యాసంస్థలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి వేరొకవైపు పరిశోధనా వ్యాసంగము కొనసాగించిరి. మద్రాసు నందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము (Brown's Library) న గల అనేక శాసనములను మరియు తాళపత్ర గ్రంథములను చారిత్రకాధారములతో సవిమర్శముగా పరిష్కరించి ప్రకటించిరి. తంజావూరి యాంధ్ర రాజుల చరిత్ర బసవపురాణము, క్రీడాభిరామము, మనుచరిత్ర, సుభద్రా కళ్యాణము మున్నగు గ్రంథములను వీరు పరిశోధించి పరిష్కరించి యుండిరి.

వీరి రచనలలో పద్యకావ్యములు, రూపకానువాదములు, గద్య గ్రంథములు, సంకలనములు మరియు విమర్శక వ్యాసము లెన్నియోగలవు. వీరు అనేకములైన చాటుపద్యములను సేకరించి 'చాటుపద్య మణి మంజరి' అను గ్రంథమును ప్రకటించిరి 'శృంగార శ్రీనాథము' అను గ్రంథమును రచించి రెడ్డిరాజుల చరిత్రకు సంబంధించిన ఎన్నియో నూతనాంశములను తెల్పిరి. 'ప్రజ్ఞా ప్రభాకరము' అను గ్రంథములో వీరు తమ ఆత్మకథను వ్రాసి నాటి తెలగు దేశపు సాంఘిక, సాహితీ తీరు తెన్నులను వర్ణించిరి.

దేశి సాహిత్య సౌందర్యముల నెన్నియో త్రవ్వితీసిన ఘనత శ్రీ శాస్త్రిగారిదే ద్విపద కవితా ప్రాశస్త్యము. గొబ్బిపాటలు, ఉయ్యాల పాటలు, వెన్నెల పదాలు, చిలుక పదాలు, ధవళాలు మొదలగు వానిని వివరించుచు తెలుగు జానపద వాఙ్మయ విశేషములెన్నింటినో వెలికి దీసిన కీర్తి శాస్త్రిగారికి దక్కును.

1939–40 లో మదరాసు నుండి తిరుపతికి చేరి పది సంవత్సరాలపాటు తిరుమల తిరుపతి దేవస్థానమువారు నిర్వహించుచున్న శ్రీ వేంకటేశ్వర పరిశోధనాలయము, ప్రాచ్య కళాశాలకు ఆధిపత్యము వహించి తాళ్లపాక అన్నమాచార్యుని సంకీర్తనములను సేకరించి ప్రకటించి యుండిరి.

తెలుగు భాష నేడు అనేక మార్పులకు లోనగుచున్నది. కొందరు పండితులు కొన్ని భాషా ప్రయోజనములనే యుద్దేశించి చేసిన కట్టుబాట్లు నిలువజాలకున్నవి. భాషా ప్రయోజనములను మానవులందరు సమముగా బడయవలసియున్నది. వాడుక భాషలో గ్రంథరచనము జరుగవలెననెడి అభిప్రాయము బలపడుచున్నది. శ్రీ శాస్త్రి గారు యిట్టి సంస్కారమును అభిలషించినవారే కాని నేడు భాషా సంస్కర్తలలో కూడ కొన్ని విషయములందు ఏకాభిప్రాయము కుదురుటలేదు. ఎవరికి వారు విభిన్న రీతులలో భాషా సిద్ధాంతములను ప్రతిపాదించు చున్నారు. చివరికిది ఎటు దారితీయునో యని తమ ఆవేదనను శ్రీ శాస్త్రిగారు ఈ వ్యాసమునందు వెలిబుచ్చినారు.

## 10. శ్రీ గుడిపాటి వెంకటచలం

తెలుగు సాహిత్య రంగంలో తన కలం ద్వారా కలకలం సృష్టించిన రచయిత శ్రీ గుడిపాటి వెంకటచలం. 'చలం' గా తెలుగునోట లక్షలాది నాలుకలపై చెలామణిలోవున్న శ్రీ గుడిపాటి వెంకటచలం 1885 లో తెనాలిలో పుట్టాడు. బి. ఎ దాకా చదువుకొని ట్రెయినింగ్ చేసి ఉపాధ్యాయ వృత్తి, స్కూల్ ఇన్‌స్పెక్టర్ వృత్తికూడ చేసి విద్యావిధానం గురించి బెర్ట్రండ్ రస్సెల్‌వంటి మేధావుల ధోరణిలో వ్యాసాలు రాసాడు.

వ్యక్తి స్వాతంత్ర్యం, స్త్రీ స్వేచ్ఛ, పిల్లల పెంపకం, బ్రహ్మ సమాజం, ఆస్తిక నాస్తిక వాదాలు, రాజకీయ సాంఘిక, సాహిత్య ఉద్యమాలు– ఒకటేమిటి సమకాలీన అంశాలన్నిటిపై ఆయన 'మ్యూజింగ్స్' వ్రాసాడు. స్త్రీ, బిడ్డల శిక్షణ,

ఆనందం, విషాదం, మొదలైన వ్యాసాలు, మైదానం, జీవితాదర్శం, అరుణ, అమీనా, దైవమిచ్చిన భార్య మొదలైన నవలలు, పురూరవ, చిత్రాంగి, సావిత్రి మొదలైన నాటకాలు, మరెన్నో కథలు రచించాడు.

నాస్తికుడుగా ముప్పై ఏళ్ళు రచనాన్వేషణ చేసి, రమణ మహర్షి శిష్యుడుగా తిరువణ్ణామలైలోని రమణాశ్రమంలో దాదాపు మూడుదశాబ్దాలు 'ఈశ్వరాశీర్వాదం'పై విశ్వాసంతో జీవించాడు.

తెలుగు సాహిత్యరంగంలో ఇంత శక్తివంతమైన కలము, ఇంత వివాదాస్పదమైన కలము మరొకటిలేదు. మరేతాత్వికునికన్నా కూడ స్త్రీ సమస్యలను శాస్త్రీయంగా అర్థం చేసుకొని ప్రతిపాదించారని భావించినవారూ వున్నారు. చలం గారిదంతా 'శ్మశాన సాహిత్యమ'ని కొట్టి పారవేసిన వాళ్ళూ వున్నారు.

'ఓ పువ్వు పూసింది' కథ చలంగారి శైలికి, దృక్పథానికి పువ్వును పరిచయం చేసే పరిమళం వంటిది. 'భారతి' రజతోత్సవ సంచికలో మొదటిసారి, కథా సంపుటాల్లో చాలసార్లు అచ్చయిన కథ ఇది.

రూసో, లారెన్స్, రస్సెల్‌వలె వ్యక్తి స్వేచ్ఛపై దృష్టి కేంద్రీకరించిన రచయిత చలం. ప్రకృతిలో స్వేచ్ఛకున్న పరిమితులను కూడ చలం ఈ కథలో భరించలేకపోయాడు.

# సవరణలు

| పాఠము సంఖ్య | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1. | 4 | 23 | పర్వతము నంటి | పర్వతము వంటి |
| 2. | 8 | 20 | పదార్థ | పరార్థ |
| | 9 | 7 | యంతయు | యంతయ |
| | 10 | 3 | పదార్థ | పరార్థ |
| 3. | 18 | 21 | చంపి వేసిరి | చంపి వేసిన |
| | 19 | 23 | వాటిని | వాటికి |
| | 19 | 24 | మొద్దును | మొద్దుకు |
| 5. | 25 | 28 | నిర్దుష్ట్య | నిరోష్ఠ్య |
| | 31 | 11 | యీసురోయని | యీసురోమని |
| | 32 | 1 | మూల | మూలం |
| | 33 | 22 | అభ్యుదయకరమైనదే | అభ్యుదయకరమైనవే |
| 6. | 34 | 19 | వ్యక్తి. స్వేచ్ఛ | వ్యక్తి స్వేచ్ఛ |
| 7. | 38 | 16 | స్వగతి చైతన్యం | స్వగత చైతన్యం |
| | 39 | 7 | జాత్యైక్య | జాత్యైక్య |
| | 39 | 7 | ఆమర్ష | అమర్ష |
| | 39 | 17 | హేమప్రళయం | హిమ ప్రళయం |
| | 40 | 7 | అనుగుణ్య అభివృద్ధినీ | అనుగుణ్యాభివృద్ధినీ |
| | 40 | 27 | కర్మ, కర్మేంద్రియా లన్నింటికి | కర్మ, జ్ఞానేంద్రియా లన్నిటి |
| | 41 | 1 | మేధస్సూ | మేదస్సూ |
| | 41 | 3 | సాధారణ కరణరూపక | సాధారణీకరణరూపక |
| | 42 | 3 | మాటిన్ | మాటిన్ |

| పాఠము సంఖ్య | పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| | 42 | 17 | పరుగెత్తేవారి | పరుగెత్తే ప్రవృత్తులేవారి |
| | 42 | 22 | ప్రవృత్తిలో | ప్రవృత్తులే |
| | 42 | 23 | రేనాల్‌గారి అభిప్రాయం: | రేనాల్‌గారి ప్రశంస: |
| | 43 | 11 | ఒక ఆడపురుగుల | ఒకవేళ ఆడపురుగుల |
| 9. | 55 | 16 | గల్గుచున్నావి | గల్గుచున్నవి |
| | 55 | 26 | గూడినిపనిగా | గూడని పనిగా |
| | 56 | 23 | భాషా విషయముననే | భాషా విషయముననే గాక |
| | 57 | 2 | నైక కంఠ్యము | నైక్య కంఠము |
| | 57 | 8 | ప్ఞచేగాని | ప్రజ్ఞచేగాని |
| 10. | 61 | 13 | కోవెల | కోయిల |
| | 66 | 23 | శెలవు | సెలవు |